శ్రా.క. 2066 | టెలిగ్రామ్: హిందిసంఘ్
సంపుటి 7 | సంచిక 8

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

*

సంపాదక మండలి :

శ్రీ మోటూరి సత్యనారాయణ, M. P.
(అధ్యక్షులు)
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు
శ్రీ పుప్పూరి రామాచార్యులు
శ్రీ సి. నారాయణరెడ్డి
శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర
959 ఖైరతాబాదు, హైదరాబాదు - 4

| సంవత్సర చందా | నవంబరు | విడిప్రతి |
|---|---|---|
| రు. 4-00 | 1960 | 35 నయాపైసలు |

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో

సంపాదకీయం

# గురజాడ జయంతి

ఈ నెల ముప్ఫయ్యో తేదీకి గురజాడ జన్మించి తొంబయి తొమ్మిదేళ్లూ, పరమపదించి నలభైయ్యేదేళ్లూ నిండుతాయి. అంటే ఈ తేదీన్నే వారి జయంతీ వర్ధంతీనూ.

గురజాడ జననం ఆంధ్ర సాహిత్యానికి అరుణోదయం. పిల్ల వసుచరిత్రల పెంకికట్లు ముసురుకున్న రోజులలో దేశికవితకు పదును పెట్టి రూపించిన కవిధీరు డాయన. సాహిత్యం ఏ కొందరి సొత్తో అనుకున్న కాలంలో అది ప్రజల సొమ్మని ఉదారంగా పంచిపెట్టిన సామ్యశీలి ఆయన. కందుకూరి సాంఘిక విప్లవాన్నీ, గిడుగు భాషా విప్లవాన్నీ తనలో సమన్వయించుకొని, సరికొత్త సాహిత్య విప్లవాన్ని లేవనెత్తిన నవయుగ వైతాళికు డాయన.

ఆయన పుణ్యాన అస్పృశ్యంగా పడివున్న వాడుక భాష అందల మెక్కింది. మెత్తని తెలుగు పలుకు కత్తివాదరలా మెరిసింది. వీధిమానిసికి వేదిక లభించింది. ఆంధ్రభారతి ముచ్చటగా ముత్యాల సరాలను అలంకరించుకుంది. నాటకం, గేయం, వ్యాసం, కథానిక- ఆయన చేతిచలవతో ఎన్నడూ లేని జవాన్నీ, జీవాన్నీ పుంజుకొన్నవి.

గురజాడ ప్రతిపాదించిన దేశభక్తి ప్రాంతాలకూ, దేశాలకూ అతీతమైంది. అది అహంకారంలోంచి పొడుచుక వచ్చింది కాదు. సత్త్వ సరస్సులో విరిసిన పుండరీక మది. విశ్వమానవ ప్రేమే దాని వృంతం.

గురజాడ వ్యక్తిత్వం ఒక పరిధిలో ముడుచుకొని వున్నది కాదు. అది బహుముఖ మైంది. నవనవోన్మేషిత మైంది. ఆయన తన ఇరవయ్యోకటో యేటనే ఇంగ్లీషులో సారంగధర కావ్యం వ్రాసి శంభుచంద్రముఖర్జీ వంటి విద్యావేత్తల మన్నన లందుకున్నాడు. భాషా సాహిత్యాలగురించి టాగూరుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరి పాడు. కవిత్వంమీదా, కాంగ్రెసు రాజకీయాల మీదా సమఉజ్జీతో అభిప్రాయాలు వెలిబుచ్చాడు. బ్రతికినన్నాళ్లూ తన లక్ష్యసాధనకై, గ్రంథశోధనకై నిర్విరామంగా కృషిచేసిన కర్మిష్ఠి గురజాడ.

ఈ నెల ముప్ఫయ్యో తేదీన ఆంధ్రదేశమంతటా ఆయన జయంతి సభలు జరుగనున్నాయి. అంతటితోనే సరిపోదు. 1961 నవంబరు ముప్ఫయ్యో తేదీన ఆయన శతవార్షికోత్సవాలు పెద్ద యెత్తున జరుపవలసి వుంది. వాటికి ఇప్పటినుంచే ప్రణాళికలు వేసు కోవాలి. విశాలాంధ్రంలోని వివిధ సంస్థలూ, రచయితలు, ఇందుకు పూనుకోవలసిందిగా మా విజ్ఞప్తి.



కవిత:

# విశ్వ కవి

—శ్రీ జె. బాపురెడ్డి

హిమగిరి శిఖరాలు, హిందూమహాంబుధి,
గంగ, యమున, కృష్ణ కలవు మాకు
కలవు తూర్పుపడమరల కనుమలు మాకు
కవిరవీంద్ర! నీవు గలవు మాకు.

కలవుగాని నేడు కనరావు కనులకు
ఐన లేదు నీవు లేని చోటు
లోనికనులు విప్ప లోకమ్ము నిండార
కలవు నీవు, వెల్గగలవు నీవు.

వంగమెకాదు, ఈ భరతవర్షమెకాదు, ప్రపంచమెల్ల ఉ
ప్పొంగెను నీ యెడంద విరబూచినకావ్య కళా పరీమళో
త్తుంగ తరంగ డోలికల; దుర్భరదాస్యవిశీర్ణ సాహితీ
ప్రాంగణమందు నాటితివి భవ్య లసద్రసపారిజాతముల్.

మంచుకొండనుగాంచి మానసమ్మును పెంచి
అమృతధారగ పారినట్టి నీకు
ఎండకాలపు గుండె ఏమేమి వాపోవు
చుండెనో వినిపించుచుండు నీకు
మెరపు ఖడ్గములాగి చిరకాలదాస్య శృం
ఖలములు తెగవేయగల్గు నీకు
బ్రతుకు నేలను పండు బాధాప్రమోదాలు
అనుభవించుచు ఋషివైన నీకు

మన్నుదున్నెడి మనుజులమధ్య యెప్పుడు
దేవుడుండునని గురుదేవ! నీకు
గురువొకండు, ఐడి యొకండు ధరణిలేదు
ధాతృవిరచిత ప్రకృతి పుస్తకము తప్ప

మంజుల భారతిన్ హృదయ మందిరమందున నిల్పి, దేవభా
షం జెలువొందు ఆ యుపనిషన్నవసారము పిండి, నీవు గీ
తాంజలి పట్టి పృ హృదయాంజలిపట్టి జగజ్జనాళి, భ
క్తిం జపియించరే! భరతదేశ యశో రవి! నిన్, కవీంద్రమా!

శీతాద్రివై నీవు గీతాంజలి ఘటించి
ప్రకృతిలో లీనమై పాడునపుడు
విశ్వభారతి వీణ వినుపించె నొక క్రొత్త
శ్రుతి, నవజీవన రుతి, రవీంద్ర!
దేశాల విడదీయు ద్వేషాగ్నికుడ్యాలు
కూలి ప్రాక్పశ్చిమాల్ కూడిపాడె
ద్యోగంగ భూగంగతో కూడి ప్రవహించె
నరునిలో దివ్య గంధములు వీచె

ప్రావృడంబోధర రథమ్ముపై నొకపుడు
పుష్పసురభిళ వనమార్గమున నొకపుడు
స్వామి యేతెంచి, నీహృది ప్రేమహస్త
ముంచి, ఆనంద జలధిలో ముంచె నిన్ను

సృష్టించితివి కవిస్రష్ట! "గోరా" ను నీ
దేశభక్తికి దివ్యదీపమట్లు
ఒక అల్పఘటన మొక్కొక చరిత్రకు బీజ
మిడునని తెలుపు నీ "పడవమునక"

నీలోని స్వేచ్ఛా దయాలక్ష్మి ఉప్పొంగి
పారెను నీ "ముక్తధార" లోన
నాట్యాభినయ కళౌన్నత్యంబు స్థాపింప
గలె నీ 'నర్తన కన్య' పూజ

నీ పవిత్ర గానముల వెన్నెలలు కాచె
అమృత హృదయ! నీ కథలు సత్యముల చాటె
శ్రీ రవీంద్రకవీంద్ర! నీ సిద్ధ వాక్జ
నిత సరస్వతి విశ్వజనీనమయ్యె

నీ 'జనగణమన' గానము
నీ జాతికి గీతమయ్యె, నీ స్వప్నము న
ద్యోజాత సత్యమయ్యెను
మా జీవిత శరచ్చంద్రమా! విశ్వకవీ!



సాహితీ సమాలోకము:

# శ్రీనాథుని సప్తశతి

—శిరోమణి అవధానము చంద్రశేఖరశర్మ

పెక్కు కారణములవలనఁ జిరకాలమునుండియును తక్కిన భారతీయ సంస్కృతీరంగములందువలె నాంధ్రవాఙ్మయమునందును ప్రాచీన సంప్రదాయము తెగుటచేత దుస్తరములగు నఘాతము లెన్నెని యేర్పడినవి. వానికి సేతువు గట్టుటకు నెందఱు మహామహులు పనివడినను నింకను నా మహానిర్మాణము పూర్తి కావలసియే యున్నది. ఈ సందర్భమున నా యీ యత్నమును నొకయుడుత సేవ యగుగాక.

ప్రాచీనాంధ్రసాహిత్యమును పరిశోధనపూర్వకముగా వివరించుటలో కీ. శే. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులుగారును, కీ. శే. వేటూరు ప్రభాకర శాస్త్రిగారును, యిటీవల బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారును విమర్శలలో విహరించి, గ్రంథగ్రంథులను విప్పి, సాహిత్యమును సమీక్షించి కావించిన కృషి సాహితీ జిజ్ఞాసువుల తపస్సునకు ముక్కారు పంట. ఐనను పూర్వ కావ్యములలోని వ్యాఖ్యాఘట్టములకు మూలములో, సంవాదములో, వెదకి కనిపెట్టియు, నా సాహిత్యములో నంతంత మాత్రము పరిచయముగల లేఖకారుల దోషమువలన గలిగిన పొరలను దొలగించియు, సముచిత పాఠములతో నర్థనిర్ణయము చేసికొనవలసిన యావశ్యకత తెలుఁగు పొలములో నింకను నెంతయో మిగిలి యున్నది. ఈ పరిశ్రమలో తెలుఁగు సాహిత్యమునందలి పట్టువిడుపుల కెన్నింటికో తాళము చెవులు సంస్కృత సాహితీపేటికలో గుప్తములై యున్నవనుట మఱువరాని రహస్యము.

ఈ సెప్టెంబరు భారతిలో సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు బ్రహ్మశ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు 'తెలుఁగు మఱుగులు' అను పేరిటఁ బ్రకటించిన వ్యాసము నిట్టి కృషిలో నొక భాగమే. అందువారు, 'ఇంకను విచారణీయము' అని వదలిన ఘట్టము నొక దానిని నా యెఱుకలో నున్న సాధన సామగ్రినిబట్టి అంతవఱకు విచారణ చేయుటయే యీ నా సారస్వత [illegible]

శ్రీనాథుని శాలివాహనసప్తశతిలోని దని లక్షణ గ్రంథములలో నుదాహృతమైన యీ క్రింది పద్యములోని పాఠభావనిర్ణయ మిందలి ప్రకృతాంశము ; పద్యమిది :

"వారణసేయ దావగోన
వా నవవారిజ మందుఁ దేటి క్రో
వ్వారుచు నుంట నీ వెఱుఁగ
వా ప్రియ పౌ తెరగంటి గంటి కె
వ్వారికిఁ గంపురాడు తగ
వా మగవారల దూఱ నీ విభుం
డారసి నీ నిజం బెఱుఁగు
నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ!"

ఈ పద్యము ఇట్లే పలువురు పెద్దలు పలుతావుల నిచ్చిన యుద్ధారములలో ముద్రితమై యున్నది. అర్థము సరిగా కుదురమి తెల్లమే. హాలుని గాథాసప్తశతిలో దీనికి మూలము గానవచ్చుట లేదనియు, నందువలన దాని తోడ్పాటుచే పద్యార్థమును గుదిరించుట కవకాశము లేదనియు, పద్య పాఠములోఁ గొన్ని చిన్న సవరణలు సేసికొని యర్థముఁ గుదుర్చుకొనుట యొక్కటే మార్గ మనియుఁ దెలిపి శ్రీ కోదండరామయ్యగారు, పూజనీయులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు సూచించినవిగా, నీ క్రింది సవరణలను దెలిపిరి.

'ప్రియ పౌతెఱ గంటి గంటికి'— అను దానికి, 'ప్రియు వా తెఱ గంటి గంటికి'— అని సవరణ. 'దావగోనవా'- అనుదానికి 'దారిగోననా' అనియో, 'ద్రావగనునా' అనియో, సవరణ. రెండవ సవరణలు తనకు లీలగా జ్ఞాపకమని తెలిపి, శ్రీ కోదండరామయ్యగారు 'దావుగోననా' అని కూడ చెప్పుకొనదగు నన్నారు. కొంత చర్చ సలిపిన తర్వాత, 'తగవా మగవా' వంటి విన్యాసముతో నున్న యీ రచనము 'దావగోనవా నవవా' అనియో, మఱే మనియో నాయికాసంబుద్ధిగానే యుండు ననియు, 'దాళ్మిగోనవా' అన్నచోఁ గుదురునేమో యనియు, వికల్పములను బ్రకటించిరి. పద్యార్థము నెట్లేని సంగతము గావించుటకు శ్రీ కోదండరామయ్యగారు చూపిన జిజ్ఞాసాభినివేశములు ప్రశంసింపఁ దగినవి.

శ్రీనాథుని పద్యమునకు మూలమైన ప్రాకృత గాథయున్నది. అది 'ధ్వన్యాలోకము'న నుద్ధృతమై, అభినవగుప్తపాదులచే సవిస్తరవ్యాఖ్యా

తమై యున్నది. ఇది యిప్పటి 'శాలివాహనగాథాసప్తశతి'లో దొరుక లేదని శ్రీ కోదండరామయ్యగారు తెలిపిరి. ఉండవచ్చును. ప్రకృతము నాకడ నా గ్రంథము లేదు. కాని శ్రీనాథుని ప్రతిలో దాని యునికి నూహింప వచ్చును. ప్రాకృత మూలము నాకు సరిగా జ్ఞప్తిలో లేదు. దాని సంస్కృత చ్ఛాయను దెల్పుదును :-

"కస్యవా నభవతి రోషో
దృష్ట్వా ప్రియాయా స్సవ్రణ మధరమ్
సభ్రమర పద్మాఘ్రాయిణి
వారిత వామే సహస్వేదా నీమ్."

ఇచ్చట సందర్భ మిది :- ఒక నాయిక అప్పుడే ఉపపతిని పొంది వచ్చినది. వాని పంటి నొక్కు ఆమె పెదవిపైఁ గనపడు చున్నది. అంతలో నల్లంతలో నామె మగఁడు వచ్చుటను చెలికత్తె చూచినది. అతఁడామె ననుమానింపకపోఁ డని రాఁగల యుపాయము నూహించినది. దానినుండి తన చెలిని రక్షించుటకై ఆమె పెదవికాటునకు వేఱు కారణముఁ గల్పించి, అది నాయికకుఁ దెలియు నట్లును, దగ్గరకే వచ్చుచున్న యామె మగనిని తాను చూడనట్లుగా నటించుచు, నాతనికి వినఁబడునట్లును నిట్లు పలుకును:-

"నేను వలదను చున్నను వినక తుమ్మెద యున్న తామర పూవును వాసన చూచు పెడసరి దానా! ప్రియురాలి మోవిపై నున్న కాటును జూచిన నెవరికి గోపము రాదు? ఇప్పుడు సహింపుము (నేను చెప్పినను వినక వలదనిన పనిని జేసితివి. ఇప్పుడు తత్తరపడిన నేమి ప్రయోజనము? నీ మగఁడు వచ్చును, చూచును, కోపించును, దండించును. ఇదంతయు నీ పెడసరితనమునకు ఫలము. అతఁడే నిలుకడమీఁద నిజమును దెలిసి కొనునులే. కాని అంతవఱకును ఈ బాధనంతయును అనుభవింపవలసినదే ఓర్పుతో ననుభవింపుము)."

ఇందు వ్యంగ్య మార్గమున దోచునట్టి భావము లనేకములు. వానిలో ముఖ్యములు కొన్ని. "నీ ప్రియురాలి మోవి కాటును జూచి వేఱుగాఁ దలఁపకుము. అది ఆమె చాపల్యముచే తామర పూవును వాసన జూచి నపుడు అందున్న తుమ్మెద కాటు గాని, వేఱుగాదు." అని సమీపమున వచ్చు చున్న నాయిక మగనిని గూర్చిన వ్యంగ్యము. 'నీ మగఁడు ప్రశ్నించిన కిటుని తపించుకొనుము. "ఎంతయు జాగ్రత్త! ఇప్పటి కిట్లు కాపాడితిని."

అని నాయికను గూర్చిన వ్యంగ్యము. "ఎంత వలపున్నను నిట్లు కాటు వైతువా? ఈమె పరకీయ కాదా? ఇంక నెన్నడు నిట్లు చేయకుము. ఇప్పటి కిట్లే ప్రమాదమును తప్పించితినిలే" అని దగ్గఱనే దాగియున్న యుపపతిని గూర్చిన వ్యంగ్యము. "నా నేర్పు చూచితిరా? చెలి మగని కన్నులలో నెట్లు కారము చల్లితినో?" అని తోడి చెలికత్తెలను గూర్చిన వ్యంగ్యము.

ఇట్లీ గాథ కప్పురము క్రోలివలె మూఁతఁ దీయుటయే తడవుగా రమణీయ భావ సౌరభముల నన్నింటిని గుబాళించునది. దీనికిఁ దెనుఁగు సేఁతయే ప్రకృతపు శ్రీనాథుని పద్యము. ఈ యాధారముతో పద్య పాఠములో నా కావించిన సవరణ లివి :-

1. 'వారణసేయ <u>దావగొనవా</u>' – 'వారణసేయఁ <u>దావిఁగొనవా</u>'

2. 'ప్రియ <u>పోతెఱగంటి గంటికి</u>' – ప్రియ <u>వాతెఱ గంటిఁ గంటికి</u>

అప్పుడు పద్యమిట్లుండును.

వారణసేయఁ దావిఁ గొన
　వా? నవవారిజ మందుఁ దేఁటి క్రో
వ్వానుచునుంటి నీవెఱుఁగ
　వా? ప్రియవాతెఱ గంటిఁ గంటి కె
వ్వారికిఁ గెంపురాదు? తగ
　వా మగవారల దూఱ? నీ విభుం
డారసి నీ నిజంబెఱుఁగు
　నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ?"

"నెచ్చెలీ, నేను వలదనుచున్నను నీవు వాసన చూడ లేదా? క్రొందామరలో తేఁటి పొగరెక్కి యుండునని నీకుఁ దెలియదా? ప్రియురాలి మోవిమీఁద నున్న కాటుచేత నెవ్వరికైనను కోపము కలుగ కుండునా? మగఁడు అనుమానించు ననియుఁ గోపించు ననియు నతనిని దూఱుట న్యాయమా? నీ భర్తయే పరిశీలనపై నిజమును తెలిసికొనును. అంతవఱకును అతని యనుమానమును, కోపమును, అంతటిని, ఓర్చుకొన వలసినదే. ఓర్చుకొనుము అని పద్యభావము. స్పష్టప్రతిపత్తికై మూలముతో ననువాదమును సరి చూపుదును.

నభ్రమర పద్మాఘ్రాయిణి వారితవామే = వారణసేయఁ దావిఁ గానవా?
నవవారిజమందుఁ దేఁటి క్రొవ్వారుచునుంట నీవెఱుఁగవా?
దృష్ట్వా ప్రియాయా స్సవ్రణ మధరమ్ = ప్రియ వాతెఱగంటిన
కస్యవా నభవతిరోషః = కంటికెవ్వానికిఁ గెంపుకాదు?
ఇదానీమ్ = నీ విభుండారసి నీనిజం బెఱుఁగునంతకు.
సహస్వ = అంతకు నోర్చునెచ్చెలీ

'తగవా మగవాఱలదూఱ' — అమూలకమగు పెంపు. అనువాదము స్వతంత్రమై శ్రీనాథుని ప్రోవకు సహజముగనున్నది.

ఈ పద్యమునకు శ్రీ కోదండ రామయ్యగారు సందర్భమిట్లూహించి తెలిపిరి :-

"నాయకుఁ డొకఁ డన్య కాంతాసక్తుఁడయి తన సతిను పేక్షించినాడు. ఒకనాఁ డాతఁడు తన క్రొత్త ప్రియురాలితోడి సంగమమును సూచించు పలుగాట్లతో నింటికి రాఁగా నది చూచి నాయికకోపపరవశయై యాతని దూషింపఁ దొడఁగినది; తుద కాతని తిరస్కారమును సహింపఁజాలక ప్రాణ త్యాగము సేయనుగూడ సంకల్పించినది. అపు డా నాయికకుఁ జెలికత్తె యొకతె తేఁటి చేష్టితము దృష్టాంతీకరించి, తన నాయిక నూఱడించుచు, మరణోద్యోగము మానుమని ప్రబోధించుచున్నది ఇది పద్యసందర్భము."

నేను ఇంతకు ముందు తెలిపిన వివరణమును బట్టి సందర్భమును గూర్చిన పై యూహ ప్రామాదిక మనుట స్పష్టము. ఇట్లు నాయికా సంబద్ధమగు వృత్తాంతమును నాయక గతముగా పొరపడిన కారణము వలననే 'ప్రియువాతెఱ' అనుసవరణయును జరిగినట్లు తోఁచును. అంతకు నోర్వు అను దానికి 'అంతకు నోర్చి యుండుము' = ప్రాణపరిత్యాగముఁ సేయఁ దలఁపకుము" అను భావవ్యక్తీకరణము గూడ పై పొరపాటువలనఁ గలిగినదే. 'దావిఁగానవా' 'ద్రావఁగనునా' 'తావుగానునా' అను సవరణలలో అర్థము నూట యెట్లున్నను, యతి భంగము కలుగక పోదు.

ఇంతయేల? మూలము గుర్తింపఁబడి తదనుసారముగా పాఠములు నిరూపితములై పద్యార్థము సంగతమైన తరువాత, బహుధా వికల్పములకవకాశ ముండదుగదా! ఇంతతో 'తెలుఁగులోని యీ 'మఱుఁగు'నకు 'వెలుఁగు' దొరకినదని సంతోషింతము.

శ్రవ్యనాటిక:

# మనమంతా ఒకటే

-శ్రీ దుర్గానంద్

అమ్మ : గౌతమీ. నర్మదా, ఎవ రక్కడ ?

నర్మద : అమ్మా. పిలిచావా.

అమ్మ : ఆ దేశాల మీదకు వెళ్లిన వారి దగ్గర్నుంచి ఉత్తరమేమయినా వచ్చిందా ?

నర్మద : దేశాల మీదకు కాదే అన్నయ్య వెళ్లింది, కాలాల మీదకు. కాలాల మీదకు.

అమ్మ : నీ ముఖం.

నర్మద : అమ్మా. అన్నయ్య ఇప్పుడు పైనుంచి పోతున్నాడుట. క్రింద ఏమీ కనుపించటం లేదట. ఈ ప్రపంచమంతా, ఈ దేశమంతా ఒక్క నలుపురంగుగానూ, తెలుపురంగుగానూ మాత్రమే కనుపించు తున్నదట.

అమ్మ : వాడి మొఖం. ఇన్ని ఇళ్లూ, ఇన్ని వాకిళ్లూ, తలుపులూ, కిటికీలూ, అరలూ సొరుగులూ, గదులూ గోడలూ అన్నీ ఒకటిగా కనుపించడ మేమిటి ? మరి ఇక్కడి గోలన్నా వినిపించుతుందా?

నర్మద : ఇన్ని గోలలూ ఇన్ని గొంతులూ వినిపించవట, సన్నగా ఉండేది వీణగొంతులాగానూ, బొంగురుగా ఉండేది సముద్రం గొంతు లాగానూ వినిపిస్తుందట.

అమ్మ : అఘోరించావు.

నర్మద : నిజంగానే, గొంతుకు రెండే గుర్తులు. ఒకటి తారు, ఒకటి మంద్రం.

అమ్మ : మళ్లీ తారు, మంద్రం మొదలు పెట్టవూ. నీకు సంగీతం ఏ ముహూర్తాన నేర్పించామో ఖర్మ, తారక మంద్రంతో చంపుతున్నావు నర్మా.

నర్మద : నాకొక్కదే అన్నయ్యకు.

అమ్మ : చిన్నోడు ఏడీ జంఝూ.

నర్మద : చిచ్చుబుడ్డి పగలగొడుతున్నాడు.

అమ్మ : చిచ్చుబుడ్డే!

నర్మద : అది స్పుత్నికంటే. పగలగొట్టి ఎగిరిపోతాడట. వాడు నుంచోవడం చూడ్లా. ఎప్పుడూ స్పుట్నిక్కు-మీద కాళ్లు బెట్టి నుంచున్నట్టే. ఎప్పుడూ ముందుకు పడబోతున్నట్టే. వాడికి వాడున్న ప్రదేశమే కనిపించదట. ముందున్నదీ ఆ ముందున్నదీ కనిపించుతుందట. అదుగో, వస్తున్నాడు నామాట ఉత్తదైతే వాణ్ణే అడుగు.

నర్మద : ఏమిరా. అన్నయ్యా. నీకు ఈ భూమి కనిపించడం లేదుగదూ ?

జంఝూ : అసలు ఉంటేగదా కనిపించడానికి.

నర్మద : మరి ఇక్కడి మనుషులు ?

జంఝూ : ఇక్కడి మనుషులూ. వీళ్లు మనుషులో కాదో ఇప్పుడప్పుడే చెప్పలేము. ముందు కుజగ్రహంలో ఉన్నవాళ్లను కనుక్కోవాలి. వాళ్లు ఎవరో తెలితేగాని వీళ్లు ఎవరో తేలరు.

నర్మద : మరి వాళ్లు భోజనం చేస్తారా.

జంఝూ : చేయరు గాలి పీలుస్తారు అక్కడ భోజనం ఎక్కడుంది ?

అమ్మ : అయ్యో. ఖర్మ. ఒకడు దేశాలమీదకు వెళ్లాడు. ఇంకొకడికి పిచ్చి ఎక్కింది.

నర్మద : దేశాలమీదక్కాదే కాలాలమీదకు, అన్నయ్య కాలాలమీదకు వెళ్లాడు.

అమ్మ : మీ తలకాయ్.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

ఆఁ మొదలయింది. ఒక గోల పోయిందనుకుంటే ఇదిగో ఇంకొకటి. గుక్కతిప్పుకోవడమే ఆలస్యం. మూగింది. మళ్లా పంపుదగ్గర మూక. వీళ్లకు ఏ ముహూర్తానా అద్దెకిచ్చానో కొంప చస్తున్నాను ఈగలూ, రాబందులూ, గబ్బిళాయిలూ, గణగణగణ గంట మోగినట్లు ఒకటే మోత. ఒక రకమూ, ఒక మొఖమూ, మరాఠీవాళ్లట, ఒరిస్సావాళ్లట, బొందిలీవాళ్లట, అరవంవాళ్లూ, కన్నడంవాళ్లూ, మళయాళంవాళ్లూ. ప్రపంచంలో ఉన్న నానా సంకరపు జాతులన్నీ మా యింట్లోనే ఉండాలీ,

## నీటిపంపు వద్ద కొన్ని స్త్రీ గొంతులు

హాటో జీ జల్దీ కరో జల్దీ.
ఏ మైఖానాకెత్త వేళకు ఉఠివో నయి.
కొంచెం నేరం ఇరమ్మాయేం, అవసరపడేం
యే బుద్ధికై సీహై నల్ సే చిపట్ గయీ
అరెరే యో ఘూఘుర్ కుణాచీ లుడుకూరాహేలీ.

అమ్మ : రామరామా, చెవులు చిల్లులు పోతున్నాయి. ఈ గోలతో పడలేమే నర్మా. ఇది వదిలి పెట్టి మనమే ఎక్కడైనా ఇల్లు చూచుకుందాం.

గౌతమి : అమ్మా. వాళ్లదికాదు ఆ గోల. మన ఇల్లే అలాంటిది. ఎప్పుడు కట్టించారో పాతఇల్లు. కాస్తపోయిగా మెసులుకోవడానికి వీల్లేదు. ఏగది ఎక్కడుండాలో దీనికి ఒక ముక్కూ, మొఖం లేదు. నా మాటవిని యీ ఇల్లు బాగు చేయించు, ఇల్లంతా కురుస్తుందట. గోడలు బీటలు వారాయట కిటికీలకు చెద. వంట గదిలోంచి పొగ పోదు. నల్ల బిగవదు. మరి ఏం చేస్తారు ?

అమ్మ : గౌతమీ. నీవు ఇంటిగొడవ ఎత్తబోకు, ఈ మూకకు మన ఇల్లు చాలా తగి ఉంది. పిల్లరోగం కుదర్చాలంటే పిల్లను ఇలాంటి ఇంట్లోనే ఉంచాలి.

నాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవానిదేహీ.
జయదేవాధి దేవాయ, త్రిగుణాయ సుమేధసే
అవ్యక్త జన్మరూపాయ, కారాణాయ మహాత్మనే.

అమ్మ : అగ్గిపెట్టె ఇటు పడేయమ్మా నర్మదా. కర్పూరం వెలిగించాలి.

( అగ్గిపెట్టె పడ్డ చప్పుడు )

ఏమిటా తొందర. ఇటు వేయమంటే అంత దూరానా వేసు కొనేది. నీ పనెప్పుడూ అంతేనే నర్మా.

నర్మద : వెనుకనుంచి అన్నయ్య నన్ను నెడుతున్నాడు.

అమ్మ : అసలు నీ నడకే అంతలే. ఆడపిల్లకెప్పుడూ అంత తొందర పనికిరాదు.

నర్మద : అందరూ నన్నే వాళ్లే. నీక్కనపడకుండా నాకాళ్లు తొక్కుతుంటాడు అన్నయ్య, నన్ను మింగేసేటట్టు కోరచూపులు చూస్తుంది అక్కయ్య. మరి నే నెటని తప్పుకోవాలి. నేనందరి కంటేచిన్న దాన్నిగా ఇంట్లో, అందుకని అలుసు. కాలు కదిపితే సరి. అదిగో చిందేస్తూంది అంటారు. నోరు మెదిపితే అదుగో రాగం తీస్తుంది అంటారు. కొండమీద నుంచి దొర్లుతున్నట్టు నడుస్తానట. అవును నా నడకే అంత. నాతీరే అంత. రాగమే తీస్తాను, చిందే వేస్తాను. ఊః.........

అమ్మ : కోప్పడమాకవే తల్లీ. ఊరికే అన్నాను. ఒరేయ్ జంఝా ఏమిట్రా గోల ?

జం : ఏమీ లేదు లేవే. మన చెల్లాయి ఏదో క్రొత్తపాట నేర్చుకుంది. పాడమంటున్నాను. నా చిట్టిగా ఆపాట పాడమ్మా. 'పైరుగాలి వీవనలో, పొలముకాడ నీడలలో......'

నర్మద : ఉహుఁ. నేనా గాలిపాట పాడను.

జం : మరే ధూళి పాట పాడతావు.

నర్మద : ఆధూళిపాటే పాడుతాను. మరే అన్నయ్యా. ఇదివరకటం పాట పాడితే రాళ్లు కరిగేవట. చెట్లు చిగిరించేవట. ఉన్న జబ్బులు పోయేవట. మేఘం పాటపాడితే వర్షం కురిసేదట. నేనా మేఘం పాట పాడుతాను.

జం : నీ కెప్పుడూ మేఘం మేఘం. ప్రపంచమంతా వరదలతో మునిగి చస్తున్నా. నీకు వర్షమే కావాలి. అదిగో అప్పుడే కురిపిస్తున్నావా కన్నుల్లోంచి ఉప్పు వర్షాన్ని. వద్దులే నా బుజ్జిగా, నీ యిష్టం వచ్చిన పాట పాడు తల్లీ.

నర్మద : మంచన్నయ్య మంచోడు. అన్నయ్యా. నేను వర్షం పాట పాడుతానుగాని నీవు డప్పు వాయించేం.

జం : నాకు డప్పు రాదుగాని ఈల ఊత్తానేం.

కదలి మునిగిపోయే భానుడు
చుక్కలతో శశి, శశితో నింగియు
చిత్రముదోచే క్రింది మనుజుడు
ఏకాలమొ ఏతిథి శకమో మరి
ఏర్పరుపలేను విశదముగా.
దరిదాపుల గుహలే నెలవులుగా
తను గొల్చే మృగములతో సరిగా
కనుకనుగా పొగమంచులలో, హృది
కలగి కలగి బ్రతికే నరుడు
పరుగిడుచుండే కాలములో
పరుగిడుచుంటిని ఓ భగినీ ... ఏ కాలమో ...

నర్మద : అక్కా. అక్కా. ఇక్కడ చూడు! వీళ్లెవరో మధ్య ప్రపంచంనుంచి దేశంలోకి చొచ్చుకవచ్చారు. అన్యజాతులు. జాతికీ జాతికీ మధ్య పోరాటం. సంఘర్షణ, సంక్రమణ. యుద్ధాలు, పోట్లాడు కుంటున్నారు. వీళ్లు పారదోలుతున్నారు. వాళ్లు ఎదురు తిరుగు తున్నారు. మళ్లీ కలుస్తున్నారు, ఎలానైతేనేం, హమ్మయ్య. ఇప్పటికి సృష్టిలో కొంత చలనం వచ్చింది.

చిన్నిచిన్ని జనపదాలు
నెలకొనె తటినీతటముల
ఏలుబడికి తొలుదొల్తగ
ఐనవి గ్రామములే కుదురుగ.
చెదరు చెదరు చినుకులతో
చెలరేగుచుండు కలహాములూ
తరుగు నొరుగు నెరుగని ధనమై
తిరుగాడుచుండు ధేనువులూ — ఏ కాలమో...
యాగములన్ కొనసాగించుటలో
భాగము లాహుతి చేసి తినుటలో
సోమలతల మధుమాదక్యములో
చొక్కి సోలి తూగుటలో — ఏకాలమో ...

అమ్మ : ఏమిటే. అది మనుష్యుణ్ణి వెంటాడుతుంది భూతంలా,

గౌతమి: అది భూతంగాదు. నిత్యామిథ్యం. జనశూన్యం, అదే అతను పుట్టినప్పటినుండి అతణ్ణి వెంటాడుతుంది.

అమ్మ: ఎవరో వచ్చారుగదా, మరి దేశాన్ని నింపడానికి.

గౌతమి: ఎంత వచ్చినా ఈ భూమిని జనసమ్మర్దం చేయలేకపోతున్నారు. ప్రకృతిని అదుపులో పెట్టుకోలేకపోతున్నారు. ప్రకృతి సంపదలు ఎక్కడికక్కడకు పండి ఒరిగి మురిగిపోతున్నాయి. చెట్టున కాసిన కాయలు ఎండి వాటంతట అవే రాలిపోతున్నాయి. నదీజలాలు ఇష్టంవచ్చినట్లు ప్రవహించి సముద్రంలో కలుస్తున్నాయి. ఈ అతిసంపదకు కూడా వాళ్లు విసిగిపోయారు. ఈ స్థితిని అదుపులో పెట్టుకొనడానికి వాళ్లు నానాయాతన పడుతున్నారు,

వర్షద: అందుకనేకాబోలు వీళ్లు దిక్కుతోచక మేఘాలవంకా, మెరుపుల వంకా, సూర్యుడూ, చంద్రుడూ, చెట్లూ, తుఫానులు తమకు అర్థంగాని సమస్త మానవేతర పదార్థాలవంకా విస్తుబోయి చూస్తున్నారు. ఇదిగో, వీళ్లు చూడు, చేతులు పైకెత్తి ప్రార్థనలు సలుపుతున్నారు,

గౌతమి;

ఇంద్రవరుణ ఋతుమరుత్తులారా !
నమోవాకములు మీకూ
సృష్టి వెడద గుండియపై బడి
చిన్నబోతిమయ్యా మేము,
మా ప్రజలను మా పొలము బుట్రనూ
మన్నించి బ్రోచుమో ఇంద్రా !
ఎటుచూచిన బంజరు బయలు
ఏమాత్రము చాలని జనమూ
తలకొక పదుగురినైనను దయ
చేయుము సంతానము దేవా — ఇంద్రవరుణ...

జగ: వండర్ ఫుల్, అక్కా నాకొక గొప్ప ఐడియా తట్టింది, పది మందిని పుట్టించాలని వాళ్లు ప్రార్థిస్తున్నారే. ఇది గ్రోమోర్ ఛిల్డ్రిన్ స్లోగన్ .. అక్కా, మన బర్త్‌కంట్రోలుకు పూర్తిగా యాంటీ స్లోగన్, అహా...ఎంత గొప్ప ఐడియా...

నర్మద : అలాంటి అనంత ప్రకృతి వడుము జీవించడం మనుష్యునికి ఎంత భయంగా ఉండేదో ? ఎటుచూచినా అడవులూ, కొండలు, పగలు రాత్రి అనేది తప్ప సరైన కాల చిహ్నాలుకూడా లేవు. మానవుడు కరువైన ఆ రోజుల్లో మానవుడంటేనూ మానవుని గుణాలు అంటేనూ ఎంత ఇష్టంగా ఉండేవో. కనీసం ఒక మనిషి దగ్గరకు వస్తేనే చాలు ననిపించేది గాబోలు. దయ, ప్రేమ, సత్యం శౌచం మొదలైన గుణాలన్నింటికి ఆ రోజుల్లో అందుకనే అంత విలువ ఏర్పడి ఉండాలి.

గౌతమి : ప్రజలకోసం రాజు, పుత్రుడికోసం తండ్రీ పరితపించే ఆ రోజుల్లో, ఒక అతిథికోసం గృహస్థు ఎదురు చూడడంలోకూడాఆశ్చర్యంలేదు. సుదూరమార్గంలో నిర్జనప్రదేశాల్లోంచి కాళ్లీడ్చుకుంటూ వస్తూ నాకెక్కడనైనా ఒక పల్లెపట్టు దొరికితే బాగుండును, అక్కడ ఒక మంచి గృహస్థు నా రాకకు వేచియుంటే బాగుండును అని అతిథి అనుకునేవాడు. గృహస్థు అంతకంటే ఎక్కువ ఆవేదనతో అతిథికోసం ఎదురు తెన్నులు చూస్తూ ఉండేవాడు. అతిథిరాని రోజున గృహస్థు తహతహలాడి పోయేవాడు.

ప్రొద్దువ్రాలిపోవుచుండె
పులుగుగూండ్ల కేగుచుండె
ఏ యతిథియు నాయింటికి
ఏలా రాలేదు నేడు

నడువలేక నడువలేక
ఆ నిర్జనవని చీలుస్తూ
జరుగలేక జరుగలేక
ఈ దుర్గమనది తరియిస్తూ

మెడపై భారము తగని మోత
నలుగడ క్రూరమృగాల వేత
ఆ అడవి నదులు దాటి దాటి
అలసియున్న అతిథికైన
అగుపించలేదా మా యూరూ.

ప్రొద్దువాలి..........

అర్ఘ్య పాద్య పుష్పాదులు
ఎన్నేని యేని కూర్చి కూర్చి
పుడిసెడు జలమేని గ్రోల
కీవరున తెన్ను జూచిచూచి
దినమంతయును వృథబోయె నా
యతిథి కొరకు వేచి వేచి
ప్రొద్దు వ్రాలిపోవుచుండె.

నర్మద : అమ్మా. ఎలా ఉంది కాలాల మీద అన్నయ్య ఉత్తరం.

అమ్మ : ఏమోనమ్మా. మీ గొడవ నాకేమీ అర్థం గావటంలేదు. సృష్టిలో మనుష్యులేరట. ఇంతగోలలేదట. దానికోసం జనం అల్లాడి పోయారట. తరువాత కొంతగోల వచ్చిందట. అది చాల్లేదట, ఏమిటే ఈ రాతలు. వాడు రాయడం మీరు చదవటమున్నా...…

జం : అవునే, వాళ్లు గోలను పూజించారు, నీవు గోలను వద్దంటున్నావు. మనింటో ఉన్న గోలలాంటి దాన్ని సంపాదించడానికి ఎందరెన్నెన్ని తపస్సులు చేశారో, మార్కోనీ చూశావ్. ప్రపంచంలోఉన్న గోలనంతా పట్టి అటుదిటూ, ఇటుదటూ జరిపాడు. మరి నువ్వు గోలను వద్దంటావు. గోలను పోగు చేసుకుంటే ఎంత లాభం.

అమ్మ : ఒరేయ్ జంఝూ నర్మదా ! గౌతమీ ! మీరంతా ఇక వెళ్ళండి. ఒక్క క్షణం నిశ్శబ్దంగా కూర్చోనివ్వండి. జపం చేసుకోవాలి. ఊఁ కదలండీ ...

హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా...

మళ్లా నీటి పంపువద్ద గళగళ నీటిశబ్దం ..స్త్రీల గొంతులు

హాయ్. హాయ్ యేనల్ బీకై సాహై
ఏక్ మినట్ భీ ఖాలీ నహీఁ హోతా.
ఏవ్ తొంభర్ పాణీ ఘేవ్ ద్యాఁ.
మోర ఘోయితా భత్తో కావుచీ మూజీబారోవచ్చి
పైయవ్ అళువరాం శీఘ్రుం వోణుం
... ... పాంగవే మరేంగే హాయ్ – హాయ్ – హాయ్...

అమ్మ : అబ్బబ్బ — వస్తున్నారా — వస్తున్నా. ఒరేయ్ జంఝూ, ఆ కిటికీ తలుపులు కాస్త వేయినాయనా.

జం : నర్మా ... తలకాయ్‌తీయ్ కిటికీ జామ్మని వేస్తున్నా. అమ్మ చెప్పింది.

నర్మద : ఊహుఁ... నేను తీయను. ఇక్కణ్ణుంచి కదలను. కింద నీటి పంపు చూడాలి. నాకు నీటిపంపు బాగుంది.

ఆ వచ్చే ముక్కు బులాకీ
ఈ పొద్దే కుమ్మతువ్వాలా
ఆహా! ఎంచక్కనిదీ జలధారా,
ఓహో ! అందమైనిదీ ఫవ్వారా.

చిందరవందర చిక్కురొత్తుగా
జుంజుంమ్మున పోయే తొందరలో
చిక్కక అందక సనసన్నముగా
ప్రవహించు తున్నదీ జలధార
పదుగురి కొక్కటి ఫవ్వారా.

ఒకే గానమై ఒకే రాగమై
చిన్నరి పొన్నరి ఒంపునడలతో
చిక్కక అందక సనసన్నముగా
ప్రవహించుతున్నదీ జలధార
పదుగురి కొక్కటి ఫవ్వారా.

అరగని సబ్బులు, రాని మరకలూ
అలుగుడు పడిపడి నాని గోరులూ
జురుకు జురుక్కని చివరి వేళలో
కసరుతుంది జలధార
విసరికొట్టి మన ఫవ్వారా.

అలతి నడలతో కొసరు చూపుతో
వెండి తీగెలా వెన్నెల కలలా
గణగణగణమని వింటె పెదవిపై
కలగీతులు పాడే గాయనిరో
అమృతధారావాహిని అది, ఏమే

అమరలోక మోహినివయో.
చిక్కక అందక ననసన్నముగా
చిన్నరి పొన్నరి ఒంపు నడలతో
ప్రవహించుతున్నదీ జలధార
పదుగురు కొక్కటి ఫవ్వారా.

అమ్మ : అమ్మా, గౌతమీ. క్రిందివాళ్లంతా అద్దె ఇచ్చారూ. నెలగడిచి పదిరోజులైంది.

గౌతమి : ఆ చివరి గదిలో వాళ్లు మాత్రం ఇవ్వలేదు.

అమ్మ : త్వరగా వసూలు చేయి. వెనుకటి బకాయీలూ ఉంచబోకు. పిల్లు దొంగలు. నమ్మడానికి పిల్లేదు. ఏ నడిరేత్తిరో మూటా ముల్లే సర్దుకొని సడి చప్పుడు లేకుండా వెళ్లిపోతారు. తరువాత ఏమనుకుంటే ఏముంది.

గౌతమి : వాళ్లు అలా చెయ్యర్లేవే. ఎంత కాలం నుంచీ యీ ఇంట్లో ఉంటున్నారు. ఇంకా ఉంటారుకూడా. ఈ యిల్లు ఇంత పాతదయినా ఇదంటే వాళ్లకు మక్కువ.

అమ్మ : అట్లా అనకు. వాళ్ల మొఖాలు చూచాప ఎప్పుడన్నా. ఏ ఒక్కడూ ఒకచోట ఉండి ఒక తీరుగా కాపరం చేసుకుంటున్నట్టు కనిపించడు. ఏదో కీసర బాసర మాట్లాడుతారు. వాళ్లు మాట్లాడేది ఒక్క ముక్కైనా తెలుస్తుందీ నీకు.

గౌతమి : తెలియకేం. నీవు వాళ్లను పట్టించుకోవు గాబట్టి నీకు తెలియదు. ఎంత పట్టించుకోపోయినా వాళ్లనేది నీకూ తెలుస్తుందిలే. నీవు కోప్పడుతుంటుంటే వాళ్లు గొణుక్కుంటారు. వాళ్లు గొణుక్కుంటుంటే నీకు కోపం మరీ ఎక్కువౌతుంది. ఇక మాట తెలియకపోవడం ఏముంది దీంట్లో.

అమ్మ : బాగుంది. సరేగాని నీవు మాత్రం......

( పోస్టు మాన్, బయటినించి కేక )

గౌతమి : అదిగో అన్నయ్య ఉత్తరం వచ్చింది. నర్మదా.. [illegible], అన్నయ్య ఉత్తరమే.

అమ్మ : గోలచేయకుండా చదువుకోండి నే వెళుతున్నా.

జం : కొంచెం వినిపోవే.

అమ్మ : మీ గొడవ నాకేమి అక్కర్లేదు. నాకు అవతల పనుంది.

గౌతమి : అయ్యో ఈ ఉత్తరంలో అక్షరాలే లేవే. అన్నీ కన్నీళ్లూ, నిట్టూర్పులూ, బాధలు. దేశం మారిపోయిందట. అంతా తారుమారైందట.

మానవసుఖ నిలయము లయ్యో, న
మానుష సంకీర్ణ వ్యథలు
పూవుల కనిపేసిన తీవెలు
పూలదారులే బందాలు.
తళతళ మెరిసే నగములకు దరి
దాపున మొసళ్లు మెరిసే
మాయలు మిథ్యా ప్రపంచవంచనల
మతములె కుళ్లి చేదులు మొలిచె
మానవసుఖ ........

వర్మన : కాని ఈ పరిస్థితి కూడా ఎంతో కాలం లేదు. ఆ కర్దమంలో ఆ ఆచారాల్లో, అవిడిపోనున్న జాతుల్లో, ఆ చెవరిపోతున్న హృదయాల్లో గభీర మేఘ మంద్ర ధ్వనితో

సత్యం వద ధర్మం చర యని
మెరసె నొక్క సంస్కృతి ఘోరపు
సంఘారామముకై రా రమ్మని
సామాన్యుని కొక పిలుపు
ప్రామినుకుల కనుగొలకులలో
ప్రాప్తించె పసిడి క్రొందళుకు
విరస దంభ ధర్మముపై గురిగా
విసరి వేసితిరో ములుకు
అది శౌద్ధోదని నిర్వాణ గాన
మావాక్కు దుఃఖతారకము
పిలిచిన యట్టుల పలికె జనము లా
పలుకే సువ్వాదు సదనమో............
సత్యం వద ధర్మం చర.

ఆ పిలుపులో విశ్వశోక సమ్మార్జనక్షమమైన ఉద్బోధన ఉంది. గ్రీష్మ తాప సంక్షుభితమైన ప్రపంచానికి విశ్రాంతి ఉంది. చల్లదనం ఉంది. శాంతి ఉంది. ఆ శాంతివాయువు ఇరుగుపొరుగు దేశాలమీదకు వీచింది. వాళ్లు చలించారు. కదిలారు. గుసగుసలుపోయారు. తండోప తండాలుగా వచ్చారు. ఈ దేశ సమౌన్నత్యానికి తనిసి కొందరు ఈ భోగభాగ్యాలకు గునిసి కొందరూ, దొంగలు కొందరు దురాశాపరులు కొందరు, పారమార్థికులు కొందరు, పరాన్న భుక్కులు కొందరు, ఓహో, వాళ్లంతా తైర్థికులు, దూరపాంథులు చిరజిజ్ఞాసాపీడితులు. అతిథులు ఆత్మోపజీవులు, ఎక్కడికి మీరు?

ఆదేశముకై మా అభిసారం
అందునెదియొ నవ సందేశం
అచ్చటి ధారుణి అమృతవాహిని
అచ్చటివారలు ఆత్మకు దగ్గర
ఆతిథ్యము వారి గుణము, ప్రా
జాపత్యము స్త్రీమేని తొడవు
ఆ దేశముకై .........
గద్దియ కొరకై అనదమ్ములు
గృహతాధిక్యముకై అలుసుగలు
ఆదేశములో కలహించారా
ఆత్మరక్షణావేశము పిన
ఆయుధమును చే పట్టారా
ఆ దేశముకై .........
ఆరుబయట పండి బం
గారు కలలు కన్నారే గాని
భీతి నొంది చోరులకని తలుపుకు
బీగము సైతము వేశారా.

— ఆ దేశముకై

గౌతమి : అది ఆనాటి సర్వోన్నతమైన సంస్కృతి. ఆ విశాల సంస్కృతి మంచి జారిపోయాడు ఈ మనుష్యుడు. ఆమె అమాయిక. ప్రపంచంమీద చల్ల నమ్ముకుని బ్రతికిన గొల్లపిల్లవంటిది. తర

తరాలు గడచిపోయినాయి. ఆ గొల్లపిల్ల ఇప్పుడు తన కృష్ణుణ్ణి గుర్తించుకోలేకపోతుంది. నెమలికన్ను ఎక్కడో పారవేసుకున్నాడు పాపం ఈ కృష్ణుడు. అందువల్ల ఆమె గుర్తుపట్టడం లేదు. బ్రతిమాలుకుంటున్నాడు. ఆ కృష్ణుణ్ణి నేనే నంటున్నాడు.

గౌతమి : ఓ ఆభీరీ !

నా వ్రజ జీవన సహచరీ !

ఓ ఆభీరీ !

శిథిల విశ్వ చేలంలో

చల్లనమ్మినావే

నా గోకులకుల — ఆభీరీ

యుగయుగాల ప్రత్యావర్తనలో

ఇకనైనా గురుతించావో

నేనా బృందావన వన విహారినే

నెమలికన్ను చేజారిన నీ

వనమాలినే.

నా మాయా వేణువు గానానికి

నాట్యమాడినావే, బర్హిణా !

శ్యామజలోహరి శఫరీ!

ఓ గోకులకుల ఆభీరీ !

నిర్జన కాళిందీ సికతలలో

నీ యభినయ మాగిన

జీవన మధ్యాహ్నంలో

ఆశాంతం వెదికానే

నీకై నా ఏకాంతంలో

నాతృష్ణాగ్నుల ఆకలి వ్రేలుటలో

చరమవ్యథా మర్మర రుతిగా

హిమకరాలవారు, ఎవరో

ఆ జలదాగమపథ

గామిని లెవరో

ఎవరో హాయని పిలిచానే

ఓ వ్రజజీవన సహచరీ !
నా గోకులకుల — ఆశీశీ ! ..

ఇదే ఆ స్నిగ్ధ సంస్కృతి. ఇదే అమేయ శిఖరోన్నత సంస్కృతి అజరామరంగా అవిచ్ఛిన్నంగా నిర్భయంగా నిరుపద్రవంగా వెలుగుతున్న భారత సంస్కృతి. మూర్ఖులు తెలిసీ తెలియక క్రూరప్రహారాలచేస్తే క్షతగాత్రిణియై సేవించింది సంస్కృతి. వంచక సృగాలాలు ఆతిథ్యంకోరి పంచకు జేరితే సద్గృహిణివలె సాకింది. ఈమె సహజక్షత్రాణి. వెన్నుదరిసి పొడిచే లుబ్ధులవంక కన్నెత్తి చూడదు. ఈమె అభిజాత. కులీన. అహరహం స్వాతంత్ర్యాన్ని అపహరింప జూచే ముష్కరుల చేతిలో ఎప్పుడూ మానాన్ని కోల్పోదు ఈమె ఆజన్మ పతివ్రత. ఈమె సిగ్గు ఈమెకు సింగారం. ప్రపంచంలోని సౌందర్యాలు ఇటునటూ గాలికి కొట్టుకుంటుంటే ఈమె చేలాంచలం చలించుతుంది. ఈమె చలించదు. చపల తరంగాల్లో పడి స్త్రీలు పరుగిడుతుంటే ఈమె పరుగెత్తదు. కొంచెం ఆలోచించుతుంది. ఇదే ఈమె గొప్పతనం. ఈమె గంభీర గమన, ప్రసన్నవదన, పుత్రవతి, ఈమె లావణ్యం, ఈమె ఆత్మ. ఈమె శరీరం కాదు. ఈమె పెదవుల చిరుహాసంలో ఉషోదయాలుంటాయి. ఈమె ఉన్నత హృదయ, అతి ప్రాచీన, సాభిప్రాయ, సత్కులీన, సద్గృహిణి. సాత్విక గుణసంపన్న, ఈమె చిరకాల సంస్కృతి. మానవ సంస్కృతికి సాక్షీభూతమైన సంస్కృతి. దివ్యావిష్కృల సంస్కృతి, అతిసుహోజ్జ్వలమైన దీదేశసంస్కృతి.

నర్మద : అవును ఆ సంస్కృతి ఎవరనుకున్నావు. నేనే నేను నేను.

నేనా చిర సంస్కృతినే
నేనీ నవ సత్యతనే
చిరదిగమై అచరాచరమై
నఖశిఖ మానగవారిధి
ప్రవహిస్తున్నా
నదమై నదినై
ఉప్పొంగిన సందేశం
ప్రవహిస్తున్నా ఇది నా దేశం.

బికిరిమన్న వెకలితనం
వెగ్గిల్లిన మూగితనం
సొంయుగీన పాణి ప్రోల
ప్రాణమిల్లని గోప్యతనం
నే ప్రవహిస్తున్నా
నా నిర్ఝర ధరణీభారం

పంటకాపు లేలుకొన్న
పాశగాని పట్టణం
పొనరున్న ఆశలతో
పటవణించు మాగాణం.
నే ప్రవహిస్తున్నా
నా నిర్ఝర ధరణీ భారం.

పదింటిగ నదులు పారి
పైడిజిమ్మె పట్టణం
పాలపొంగు క్రింద పండి
కిడుకుతున్న సంతానం.
గాలిపంట వాదెక్కడ
పాలు కొంత శాస్త్రంలో
చెర్చి చిల్చి కాదిక్కడ
పలుకొంటు రాజ్యంలో
నే ప్రవహిస్తున్నా
నా నిర్ఝర ధరణీ భారం
జాలివెట్టు గద్దరిని
ప్రిలజేయు ఆవేశం
రోజురోజు సుఖము పెంచు
కొత్తరకపు సందేశం.
ప్రాతయుగపు బురుజులన్ని
బాగుపడ్డ కారణం

కోటగవనులందు ప్రజా
కోటి పచ్చ తోరణం
నే ప్రవహిస్తున్నా
నా నిర్ఝర ధరణీ ఖారం
చిరచిరమై అచరాచరమై......

జంఝూ : అమ్మా. అమ్మా. అమ్మ ఎక్కడుంది ?

నర్మద : ఆ పిట్టగోడ మీద కూర్చుందిరా ఒంటరిగా.

జంఝూ , అమ్మ సీరియస్‌గా ఉందే.

నర్మద : కాదు బెంగగా ఉందిరా.

గౌతమి : ఏదో ఆలోచించుకుంటుందిలే మీరు గోలచేయకండి.

అమ్మ : అమ్మా. గౌతమీ. క్రింద వాళ్లింట్లోపమిటే ? ఈవాళ అంతా ముస్తాబై వచ్చారు.

గౌతమి : పూజ జరుగుతుందమ్మా.

అమ్మ : పూజ జరుగుతుందా. ఎంచక్కగా ఉన్నారు పిల్లు కళకళలాడు తున్న ముఖాలు. చేరడేసి కళ్లు. రెప్పలనిండా కాటుక. ఉల్లి పొరల్లాంటి పమిటలు. నుదుటిని ఇంతకుంకం, పిళ్లంతా.

జంఝూ : పిళ్లంతా ఆ పంపు దగ్గర వాళ్లేనే అమ్మా.

గౌతమి : నువ్వూరుకోరా.

( క్రిందనుంచి గణగణగంటమోత, రెండుమూడు కంఠాలు శ్లోకాలు చదవడం )

జయ దేవాధి దేవాయ త్రిగుణాయ సుమేధసే
అవ్యక్త జన్మరూపాయ కారణాయ మహాత్మనే.
పుష్కరేతు కురుక్షేత్రే గంగాయాం మగధేషుచ
స్నాత్వా తారయతే జంతుః సప్తసప్తావరాంస్తథా.

అమ్మ : గౌతమీ. పిల్లు నేననుకునే శ్లోకాలే అంటున్నారు ? అపూజకూడా నేను చేసినట్లే చేస్తున్నారు.

( మళ్లా క్రిందనుంచి )

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

అమ్మ : అదుగో. ఆ గీతా శ్లోకం కూడా నేనూ చదివేదే.

గౌతమి : అవును నీకు వాళ్లకూ ఒకే గీత, ఒకే మంత్రం. పూజలో నువ్వూ వాళ్లూ ఒకటేనే.

అమ్మ : మరి వాళ్లు పంపుదగ్గర అలా ఉన్నారేం.

గౌతమి : వాళ్లు పంపుదగ్గర అలాగే ఉంటారు. పూజదగ్గర మాత్రం అచ్చంగా నీలాగానే ఉంటారు. నీవు చదివేవే చదువుతారు.

అమ్మ : మరి పంపుదగ్గరా.........

గౌతమి : అవును పంపుదగ్గర ఈదేశం అంతే, గోలాగా ఉంటుంది.

అమ్మ : అదిగాదే నేననేది, ఆ పంపు దగ్గరే.........

గౌతమి : అవును ఆ పంపు దగ్గర నీవు ఈదేశం శరీరమే చూచావు.

అమ్మ : మరి ఆ పంపుదగ్గరవాళ్లూ, ఈపూజదగ్గరవాళ్లూ ఒకటేనంటావా?

గౌతమి : ఒక్కటే. వేరే ఎక్కణ్ణుంచి వచ్చారు. వాళ్లే పిల్లు.

అమ్మ : అదే నే నడుగుతుంది. వాళ్ల పిల్లన్నమాట.

( పూజనుంచి ఇద్దరు పంపుదగ్గరకువచ్చి పంపుతిప్పి నీళ్లు రాక ముసలమ్మను చూచి )

ఒకగొంతు: ఏమమ్మోయ్ ముసలమ్మా! నీళ్లు రావడంలేదు.

రెండవగొంతు : ఈ ముసలమ్మ బలే మంచిదే. సరిగ్గా పూజవేళకు నల బిగించి కూర్చుంది.

ఒకగొంతు: వదలవమ్మా. వదులు. పిల్లలు నీళ్లకు ఏడుస్తున్నారు.

అమ్మ : ఉండండి నాయనా ! ఒక్క క్షణం ఆగండి. ఇల్లు బాగుచేయిస్తున్నాను. నల్లా బిగించారు గాబోలు. ఊఁ ఇప్పుడు తిప్పి ...

అందరూ : ఆఁ...ఆఁ ... వస్తున్నాయిలే వస్తున్నాయి. ఈ ముసలమ్మ బలే మంచిదే.

( పంపునుంచి గళగళ శబ్దం )

చిక్కక అందక సనసన్నముగా
చిన్నరి పొన్నరి ఒంపు నడలతో
ప్రవహించుచున్నది జలధార
వదుగురి కొక్కటి ఫవ్వారా...

* * *

వ్యాసము

# నవలయందలి పాత్రపోషణ

—శ్రీ జె. విశ్వమిత్ర

"మానవ జీవితమును చిత్రించు నదియే నవల"యని ప్రసిద్ధ నవలా రచయిత శ్రీ ప్రేమచంద్ నుడివెను. దీనిబట్టి నవల యందు పాత్ర పోషణ కెట్టి స్థానము కలదో యూహించుకొన వచ్చును. పాత్ర పోషణకు గల ప్రాముఖ్యము నవల యందే కాదు నాటకము ప్రబంధము లందు గూడ గలదు. మహత్తర పాత్రలను సృష్టించుట వల్లనే వాల్మీకి నుండి యిప్పటి వర కెందరో కవులు, వారి కావ్యములు దేశ కాల పరిమితుల నతిక్రమించి, శాశ్వతములైనవి. భారత రామాయణాదు లిందుకు ప్రథమ గణ్యములు. మహత్తర పాత్రలను చిత్రించుట యందు నవల కూడ వెనుకంజ వేయ లేదు. ఆకర్షణీయమును, సజీవమునగు పాత్రపోషణయే నవలను చిరస్మరణీయ మొనర్చును. కాలాంతరమున పాఠకుడు నవలా కథా సంవిధానపు సూక్ష్మ నిర్మాణమును విస్మరించినను అది ప్రభావ వంతమగు పాత్రపోషణ కలిగి యున్న యెడల ఆ పాత్రల నెప్పటికి మరవజాలడు. ఆ పాత్రల వలననే ఆ నవల కూడ అతని స్మృతి పథమున నిలిచిపోవును. 'అన్నా కేరినీనా'లోని అన్నా, 'జాన్ క్రిస్టాఫ్'లోని జాన్ క్రిస్టాఫ్, 'వార్ అండ్ పీస్' లోని నటాషా, పియర్; 'గుడ్ ఎర్త్'లోని వాంగ్ లుంగ్, 'గోదాన్'లోని హోరి, 'శేఖర్: ఏక్ జీవనీ'లోని శేఖర్, 'దేవదాసు'లోని దేవదాసు, 'వేయి పడగలు'లోని ధర్మారావు, 'నారాయణరావు'లోని నారాయణ రావు మొదలగువానిని పాఠకు డెన్నడు మరవజాలడు. వాస్తవ మరసి చూచిన జీవవంతమగు పాత్రల సృష్టి వలననే రచయిత గొప్పవాడనిపించుకొనును. అతని భౌతిక దేహము నశించినను అతని యశశ్శరీరము అతడు నిర్మించిన పాత్రల ద్వారా యుగ యుగాంతముల వరకు వ్యంజితమగుచుండును.

## కథాసంవిధానము, పాత్రపోషణ యన్యోన్యాశ్రితములు

నవలయందు కథా సంవిధాన పాత్రపోషణలకు హద్దులను నిర్వచించుట యసాధ్యము. కేవలము పఠనసౌలభ్యముకొరకే యీ రెండు

తత్త్వములు వేరు చేయబడుచున్నవి. సంక్షేపమున, కథా సంవిధానము సంఘటనలకు కళాత్మక రూపము చేకూర్చును. (కథా సంవిధానపు పరిభాష జులై స్రవంతిలో చూచునది). ఈ సంఘటనలు స్వయం సంపూర్ణములు కావు. వీనికి పాత్రలాధారములు. పాత్రలవలననే సంఘటనలు ఘటింపబడును. అనగా పాత్రల అర్థవంతములగు క్రియావ్యాపారములే సంఘటనలనబడును. ఆ సంఘటనలే పాత్ర పోషణకు తోడ్పడును. సుప్రసిద్ధ నవలా రచయిత హెన్రీ జేమ్సు ననుసరించి ... 'సంఘటనను నిర్ణయించునదే పాత్ర, పాత్రను నిదర్శించునదే సంఘటన'[1] రచనా నైపుణ్యముగల నవలయందు పాత్రల క్రియాశీలత నిరంతరము గోచరించుచుండును. ఈ క్రియాశీలత బాహ్యాంతరంగిక రూపములలో గూడ నుండవచ్చును. దీనివలన విశదమగునదేమన అర్థవంతమగు పాత్రల బాహ్యాంతరంగిక క్రియావ్యాపారమువలన కథా సంవిధానము నిర్మించబడును. ఆ పాత్రల క్రియావ్యాపారమువలన నిర్మింపబడు సంఘటనలే పాత్రపోషణకు తోడ్పడును.

నవలకు కథా సంవిధానము శరీరమైన పాత్రపోషణ ప్రాణము. ప్రాణరహితమగు శరీరము నిరుపయోగము. శరీర హీనమగు ప్రాణము నిరాధారము. అదేవిధముగా నివి రెండును పరస్పరాభావముచే నసంపూర్ణములు.

నవలా నిర్మాణమునకు పూర్వము రచయిత మనస్సున రూపొందునది పాత్రలా కథా సంవిధానము యను ప్రశ్న యవిచారమూలకము. అనుభవజ్ఞుడయిన నవలా రచయిత కల్పనలో పాత్రలను గురించి నిశ్చితాభిప్రాయము కథా సంవిధానపు సంపూర్ణ దృక్పథము రూపొందినపుడే అతడు నవలను రచించుటకు పూనుకొనును.

నవల చదువునపుడు పాఠకునియందు పాత్రలను గూర్చి కుతూహల ముదయించును. ఆ కుతూహలమును తృప్తిపరచునది కేవలము కథా సంవిధానమే.

1 "What is character but the determin^tion of incident; what is incident but illustration of character."

Quoted in 'Theory of Literature' P. 224.

by Wellek & Warren.

శిల్పము ననుసరించి రచనను, నిర్మాణప్రక్రియ ననుసరించి రచయితను, అభిరుచి ననుసరించి పాఠకుని పరిశీలించినచో కథాసంవిధానము పాత్రపోషణ యన్యోన్యాశ్రితములని విశదమగును.

## నవలలో చిత్రించబడు జీవితము-వాస్తవిక జీవితము :—

జీవితపు వైవిధ్యములను సాహిత్యము చిత్రించును. మానవుని సమస్త భావనలను క్రియావ్యాపారములను, సుఖ దుఃఖములను జీవితపు బాహ్యాంతరంగిక విధానములను వ్యక్తము చేయునది సాహిత్యమే.

ఈ సందర్భమున సాహిత్యస్రష్ట వాస్తవిక జీవితమును తూచా తప్పకుండ చిత్రించునా అను ప్రశ్న మన కుదయించును. కాని ఇది అసమంజసము. సాహిత్యములో మానవ జీవనమును చిత్రించునపుడు కొంత కృత్రిమత వచ్చును. వాస్తవిక జీవితపు సమస్త ప్రసంగములను యథాతథముగా చిత్రించిన అవి అసంబద్ధములయి వికృతముగా కనిపించవచ్చును. 'నవల వాస్తవిక సత్యముపై ఆధారపడియున్నను రచయిత స్వభావమును బట్టి వాస్తవిక సత్యమందు కొన్ని చేర్పులు తొలగింపులు చేయబడును. రచయిత స్వభావమే వాస్తవిక సత్యపు ప్రభావమును సంస్కరించును, లేదా కొన్ని సందర్భములలో దానిని పూర్తిగా మార్చివైచును.' [1] రచయిత తన ఈ స్వభావమువలననే జీవితమునుండి సార్థకమైన సంఘటలను సంగ్రహించును. వానికి నూతన రూపమొసగును. అప్పుడే అతని రచన మానవ జీవిత సత్యములను ప్రకాశింపజేయునదై ప్రభావ పూరితమై అభిరుచిని కలిగించును. జీవితముపై ప్రభావమును ప్రసరించునట్టి జీవితపు విలువల కాధారములగు నిగూఢ సత్యములను పరిశోధించి వానిని రచయిత తన రచన యందు రూపొందించుటకు ప్రయత్నించును. ఇందువలననే నవలయందు వాస్తవిక జీవితపు విషయము లన్నిటికి స్థాన ముండదు. బాహ్య విషయములనే నవలా రచయిత వర్ణించినచో వానియందు జీవితపునిగూఢ సత్యమును వ్యక్తపరచలేదు.

---

1 A novel is based on evidence + or — x, the unknown quantity being the temperament of novelist, and the unknown quantity always modifies the effect of evidence and some times transforms it entirely.

E. M. Forster — 'Aspects of the Novel' P. 44.

సాహిత్యపు వివిధ రూపములలో నవలయే వాస్తవిక జీవితమునకు విపులత, నిండుదనము చేకూర్చును. పూర్వోక్త విషయపరిశీలనమున స్పష్టమగున దేమన వాస్తవిక జీవితమున సంభవించు కార్యవివరణ మంతయు నవలయందు చిత్రించబడదు. ఇదియే కాక నవలా జీవితము వాస్తవిక జీవితముకంటె సంపూర్ణత్వమును కలిగియుండును. బాహ్య ప్రపంచమున మనము మనుష్యుల బాహ్య జీవితమునే గాని ఆంతరిక జీవితమును తెలిసికొనలేము. కాని నవలయందు పాత్రల బాహ్యాంతరంగిక జీవితములు [1]స్పష్టమగును. పాత్రలకు పాఠకునకు మధ్య రహస్యమనునది యేదియును నుండదు. దీనివలన పాఠకుని జీవితానుభవము లధికమై, జ్ఞాన మభివృద్ధియై అతనియందు జీవితము పట్ల జాగరూకత పెంపొందును. తత్ఫలితముగా అతని వ్యక్తిత్వము న్నతమగును.

## పాత్రలరూప కల్పన :—

మానవుడే సాహిత్యమునకు సర్వధా ఆధారము. అతని వ్యక్తిత్వమే సాహిత్య రూపములలో నానాప్రకారములుగా రూపొందును. పాత్రల రూపకల్పనను పరిశీలించుటకు పూర్వము పాత్రపోషణ యనగా నేమియో తెలిసికొనుట అవసరము. ఏవేని విశేష పరిస్థితులలో నున్న మనుష్యునిలో ఏ సమయమున ఏ భావములు కలుగునో తత్ఫలితముగా అత డేమి చేయునో, ఏమి మాటాడునో—ఇట్టివన్నింటిని జీవవంతముగా ప్రదర్శించుటయే పాత్రపోషణ ప్రధానలక్ష్యము.

## పాత్రలు-వాని మూలరూపములు :—

సమాజమునందలి వ్యక్తులే నవలయందలి పాత్రలకు మూలాధారములను విషయమును గురించి విమర్శకు లేకాభిప్రాయము వెల్లడించలేదు. కొందరు విమర్శకులు నవలా పాత్రల మూల రూపములు (Originals) సమాజమున కలవనియు, మరికొందరు విమర్శకులు పాత్రలు కేవల కల్పనా

---

1 "They (Characters) are people whose secret lives are visible; or might be visible: we are people whose secret lives are invisible."

E. M. Forster — 'Aspects of the Novel.' p. 62.

అనిత్యములనియు వక్కాణించిరి. తుర్గనేవ్ ననుసరించి—"లౌకిక వ్యక్తుల ఆధారము లేకుండ రచయిత పాత్రను నిర్మించలేడు. ఏ దేని ఒక నిశ్చిత మానవ రూపమును తన మనస్సులో రూపొందించు కొనకుండ పాత్రను జీవవంతముగా చేయలేడు.[1]" పాత్రలు కేవలకాల్పనికము లన్న వాదముకూడ సమంజసముగాదు. ఎందువలననగ రచయిత చేతన మనస్సు (Conscious mind)న తన పాత్ర రూపము స్పష్టముగా నుండకున్నను అతని అచేతన మనస్సు (Unconscious mind) న సంగ్రహింపబడిన అనుభవములలో ఏదో ఒకటి తనపాత్ర కాధారముండును. నవలలను తత్సంబంధియగు రచయితల జీవితములను కూలంకషముగా తెలిసికొనిన యెడల రచనలలోని పాత్రల మూల రూపములను కనుగొనుట దుష్కరకార్యము గాదు 'వార్ అండ్ పీస్' లోని పేరీ, ఎండ్రీలు రచయిత టాల్ స్టాయ్ వ్యక్తిత్వపు రెండు రూపములు. శ్రీ ప్రేమచంద్ పాత్రలమూల రూపములు కూడ సమకాలీన సామాజిక జీవనమునుండియే గ్రహింపబడినవి. 'రంగభూమి' అనునవలలోని సూరదాసను పాత్రకు మూల రూపము రచయిత గ్రామమున నివసించు ఒక అంధభిక్షువు.

నవలయందలి పాత్రలకు సామాజిక వ్యక్తుల ఆధార ముండును. కాని రచయిత వానిని యథాతథముగా గ్రహించడు. నవలా రచయిత సామాజిక వ్యక్తులనుండి పాత్రపోషణ కవసరమగు విశేషములనే గ్రహించి తన కల్పనతో వానికి పూర్ణత్వము నొసగును. పాత్ర పోషణ చేయునపుడు పాత్రతన మూల రూపమువలెనున్నదా లేదా అని తలంచడు, కాని లక్ష్య సిద్ధికొరకు పాత్రలాకర్షవంతముగను, సుసంగతముగను ఉండుటయందే అతని దృష్టి కేంద్రీకరింపబడి యుండును. పాత్ర కేదో యొక మూలరూపమున్నను పాత్ర పోషణయందు ప్రధానమైనది రచయిత యొక్క కల్పన. అతడు తన పాత్రల మూల రూపముల స్థూలాధారమును గైకొని తన కల్పనా సామర్థ్యము వలన పాత్రలకు ప్రాణము పోయును, ముఖాకృతిని, అంగ సౌష్ఠవమును నిర్మించును. దీనితో పాటే పాత్ర భావములకు, అభిప్రాయములకు ఒక విశిష్టతను చేకూర్చును. మూల రూపమును గ్రహించి దానిని పాత్రగా రూపొందించవచ్చును. లేదా పాత్ర యొక్క మూల రూపము సమాజములో

1 Quoted in 'The Summing up.' p. 132–133 by Sommorset Maugham.

మూయుట అసంభవము కాదనిపించు పాత్ర సృష్టియైనా చేయవచ్చును. ఈ విషయము రచయిత ప్రతిభా కల్పనలపై ఆధారపడియుండును.

## ప్రధాన పాత్రలు – అప్రధాన పాత్రలు

నవలా జీవితమునకు సంపూర్ణతను చేకూర్చుటకు నవలా రచయిత తన రచనయం దనేక పాత్రలను సృష్టించును. వానిలో కొన్ని ప్రధానములు మరికొన్ని అప్రధానములు. నవలా రచయిత దృష్టియంతయు ప్రధాన పాత్రయందుగాని ప్రధాన పాత్రలశీలవైశిష్ట్యములను వ్యక్తపరచుట యందుగాని కేంద్రీకరింపబడియుండును. ఈ లక్ష్య సిద్ధికొరకే అతడు అన్యపాత్రలను సహకారులుగా గైకొనును. ఈ పాత్రల క్రియా వ్యాపారములు ప్రధాన పాత్రల శీలనిర్మాణమునకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని సహాయపడును. ప్రముఖపాత్రలకు విభిన్న పరిస్థితులు పలురకములగు పాత్రల సంసర్గమును సంభవించునపుడే వాని స్వరూప విశేషములు గోచరించును. నవలాకారు డీ విధముగా ఎన్ని ఎక్కువ పాత్రలకు విశిష్ట వ్యక్తిత్వమును ప్రసాదించునో అంతటి గొప్పవాడగును. ఉదాహరణకు టాల్‌స్టాయ్ 'వార్ అండ్ పీస్' తీసికొనవచ్చును అందు దాదాపు 500 పాత్ర లున్నవి. వానిలో విశిష్ట వ్యక్తిత్వము నందికొనిన పాత్రల సంఖ్య 25కు తక్కువలేదు.

కొన్ని నవలలయం దప్రధాన పాత్రలను అవి నిర్వర్తించవలసిన కార్యము పూర్తి కాగానే రచయిత ఆకస్మికదుర్ఘటనల ద్వారా అంత మొనర్చును. ఎందువలనన అతడు నవలాంతమువరకు పాత్రలను పోషించవలసిన అవసరము లేదు. వాస్తవిక జగత్తున కూడ మనమెన్నియో దుర్ఘటనలను చూచుచున్నాము. కాని నవల యందిటువంటి దుర్ఘటనలకు తావీయవచ్చునా లేదా అను నదియే ప్రశ్న. రచయిత తన లక్ష్యము సిద్ధించినదనియు, తన రచన ప్రభావవంతమయినదనియు అనుకొన్నప్పుడు మాత్రమే ప్రధాన పాత్రలకు దుర్ఘటనల సంయోగము కల్పించి వానిని తన రచననుండి దూరముచేయును. ప్రధాన పాత్రల విషయమెట్లున్నను అప్రధాన పాత్రల ప్రయోజనము రచనయందు లేనియెడల వానిని తొలగించును. ఒక సమీక్షకుని దృష్ట్యా – "ఆకస్మిక దుర్ఘటనల ద్వారా అప్రధాన పాత్రలనంత మొనర్చు ఫలితముగా ప్రధాన పాత్రల ప్రతి క్రియ లభిరుచివంతములైన యెడల అప్రధాన పాత్రలను కథాభూమినుండి దూర మొనర్చుట సమంజ

సము. ఈ విధమగు కథాగమన ప్రయోగమును రచయిత తిరస్కరించుట తర్కసంగీతము కానేరదు.[1] కాని ఈ ఆకస్మిక దుర్ఘటనల నియోజన మధికము కాకూడదు. ఎందువలనన వాస్తవిక జీవితమునగూడ ఇటువంటి దుర్ఘటన లరుదుగా సంభవించును.

## పాత్రల బాహ్యాంతర రూపములు

నవల యందు పోషింపబడు పాత్రల యెల్ల విషయములు రచయితకతి స్పష్టమై యుండవలయును. అతడు పాత్రల బాహ్యాంతరంగిక సమస్త విశేషములతో అనగా క్రియా వ్యాపారములు, మానసిక వైలక్షణ్యములు, మానసిక ద్వంద్వములు అనువానితో అతి పరిచితుడయి యుండును. అతనికి పాత్రల వైయక్తిక పరిధులపట్ల నిర్ణీతమైన దృక్పథ ముండును - అనగా ఏ పరిస్థితులలో ఏ యే సన్నివేశములలో పాత్రను క్రియావంతముగా చేయవలయునో, ఏ యే గుణ దోషముల నుద్ఘాటింప వలయునో అతనికి తెలియును. "నవలా నిర్మాణ ప్రక్రియలో పాత్రలు రచయిత నంటిపెట్టుకొని యుండవలయును. అతని మనశ్చక్షువుల ముందు పర్యటించు చుండవలయును, హృదయ శ్రవణముల వద్ద మాటాడుచుండ వలయును.[2]" అప్పుడే ప్రాణవంతమగు, జిగి కలిగిన పాత్రలను రచయిత సృష్టించ గలుగును. పాత్రపోషణ ఇటువంటి పర్యవేక్షణానుభూతులతో చేసినప్పుడే వానివలన పాఠకుని భావుకత్వము (Sensctiveness) పెంపొందును, అతని జ్ఞానము వికసించును.

---

1 "It is probably wiser to use an accident for the removal of a minor character — the result of his accidental death and the reaction of the principal characters may be interesting; there seems no reason for a novelist to deny himself a moderate use of this theme."

Robert Liddle – 'SOME PRINCIPLES of Fiction' P. 93

2 "While the novelist is writing his book, his human beings must be with him, before him. moving before the eye of his mind and talking into the ear of his heart." (F. MARIN CRAWFORD.)

Quoted in 'the Technique of novel writing' P. 93
by Basil Hogarte.

సామాజిక జీవితమున మనము విభిన్న ప్రకృతులు, విశిష్ట వ్యక్తిత్వ ములు గల మనుష్యులను చూచుచున్నట్లుగానే నవల యందు గూడ విభిన్న ప్రకృతులు, విశిష్ట వ్యక్తిత్వములు గల పాత్రలను చూడగలము. నవలా రచయిత పాత్రల స్థితిగతులను ననుసరించియు, వాతావరణము ననుస రించియు ఆచారములను, జీవిత విధులను, ప్రవృత్తులను మనోభావములను చిత్రించును. రచయిత ఈ విధముగా పాత్రల బాహ్యజీవన విధులతోపాటు అంతఃప్రకృతిని కూడ చిత్రించును. అసలతడు తన ప్రతిభానైపుణ్యాము లను పాత్రల మానసిక వ్యక్తిత్వమును చిత్రించుటకే వెచ్చించును. పాత్రల నిగూఢ మానసిక స్థితులను వెల్లడి చేసినప్పుడే పాత్రకు విశిష్ట వ్యక్తిత్వము సమకూరును. పాఠకుడు కూడ ఇదియే ఆశించును. పాఠకుడు కేవలము పాత్రయొక్క బాహ్యజీవితపు గతిపధని మాత్రమే ఆశించడు; అతడు పాత్ర యొక్క జీవిత రహస్యములతో పరిచితుడు కావలయునని కోరుచుండును.

## పాత్రపోషణ నిర్ణయ రూపమున కాదు, పర్యవేక్షణ రూపమున

పాత్రపోషణ ప్రక్రియలో రచయిత తన నిర్ణయములను పాత్రలపై ఆరోపించకున్నప్పుడే, వానిని పూర్వనిర్ధారిత మగు పరిధి యందుంచ కున్నప్పుడే పాత్ర బాహ్యాంతరంగిక వ్యక్తిత్వములు సహజముగా నుండును. పాత్ర లోకే కర్మాగారపు మూసలో తయారగు బొమ్మలు కావు, తోలు బొమ్మలాడించు వాని చేతిలో అతని ఇష్టము వచ్చునట్లాడు బొమ్మలును గావు. పాత్రలు మానవులకు ప్రతి రూపములు. వాని వికాసము కూడ మనుష్యుని వ్యక్తిత్వ వికాస మయినట్లుగానే యుండుట సమంజసము. నవలయందు కథాసంవిధాన వికాసముతోపాటు పాత్ర వికాసము క్రమ క్రమముగా జరిగిన యెడల సహజముగా నుండును. రచయిత తన నిర్ణయ ముల నారోపించక కేవలము పాత్రల కార్యకలాపములకు సాక్షీభూతు డుగా నున్నప్పుడే జీవవంతమగు పాత్రపోషణ సంభవమగును. రచయిత యొక్క ఈ పరిశీలనా శక్తి క్షీణించిన యెడల పాత్రపోషణయందు గతి హీనత, నిర్జీవత్వము, శైథిల్యము గోచరించును. రచయితయే తన పాత్రల సృష్టికర్త యైనప్పటికి తన భావ పరంపరలనే వానిపై ఆరోపించడు. అతడు పాత్రల మానసిక ప్రవృత్తిని, స్వభావమును అనుసరించి వికసించుట కవకాశమును కల్పించును. చెఖోవ్ ననుసరించి — "ఏ పరిస్థితులలో

పాత్ర ఏమి ఆలోచించునో, ఏమి మాటాడునో దానిని వర్ణించుటయే నవలా రచయిత కర్తవ్యము. రచయిత ఎప్పుడును పాత్రలనుగాని వాని మాటలనుగాని నిర్ణయించకూడదు, కేవలము సాక్షిగానే వ్యవహరించ వలయును. (1) ఈ విధముగా వ్యవహరించుట కతని పర్యవేక్షణాశక్తి తీవ్రమైనదై యుండవలయును. పాత్రల ప్రవర్తనతో అత డేకీభవించ కున్నను వానిని యథా రూపమున చిత్రించునప్పుడే పాత్రపోషణకు న్యాయము చేకూర్చ కలుగును. అప్పుడే పాత్రపోషణ సహజముగా నుండును. రచయిత జీవితమునకు, అతడు సృష్టించిన పాత్రల జీవితములకు మధ్య ఎక్కువ అంతర్యమున్నప్పుడే అతనియందు తీవ్రపర్యవేక్షణశక్తి యుదయించును. ఈ అంతర్యాధిక్య పరిమాణముపై రచయిత గొప్పతన మాధారపడి యుండును.

(T. S. Eliot—"There is always a seperation between the man who suffers and the artist who creates; and the greater the artist the greater the seperation.")

(సశేషము)

1 CHEKHOV—The novelist business is only to describe who has been speaking or thinking and in what circumstances. An artist must never be the judge of his characters or of what they say, but only an impartial witness."

Quoted in 'The Technique of Novel writing.' P. 111
by Basil Hogarth.

కవిత :

# నిశాభావన

—శ్రీ టి. వి. యం. అయ్యావారు

శిశిర నీహార ధూళి వర్షించుచున్న
యీ నిశావేళ - మృదులతావృత మహీజ
దళచయమ్మున నడగిన అంరువోలె
మత్ప్రియా శ్లేషమధురిమ మరగ గంనో !

వివృత భావపక్షమ్ముల విప్పి - వ్యోమ
వీధికెగసి - లేచుక్కల వీణియలను
అభినవ శ్రుతి సంధాన మాచరింప
గలనో - తచ్చాలనానిలకల రవముల -

శబర శ్యామలగండక చ్ఛవుల - పొగల
గ్రక్కు శార్వర ప్రతి సీతికలకుమలగి,
నా యెడద, చిచ్చురేపిన నాగరికుల
ఉసురులకు స్వస్తి చెప్పుదునో తెగించి -

దుఃఖమయమైన బ్రదుకును త్రోయలేక
ఏమి కావలె - యీ మహోద్దామ తిమిర
జాలమున తనువును త్రోసి సర్వవాయు
పథముల చరింతునో ప్రేతభావమునను

అపుడు నా భయంకర వికటాట్టహాస
కహాకహా ధ్వని దిక్కుడుంగములు చెదర-
వేయిజన్మలకునులేని వింత తృప్తి
పడయుదునో చండతాండవ వర్తనముల

జీవనామరతటిని రాజీవములగు
స్వామి పాదాంకముల శిరసావహించి
పులకిత శరీరముననేవొ-యులిపులేని
హర్షగీతు లాలాపింతునా ! చిరమ్ము-

ఏమి-! ప్రాచీముఖమ్మున నింతకుంకు
మంపు తిలకమ్ముదిద్దిన సొంపువెలసె-
స్నేహ శూన్యమ్మునై దీప శిఖయు చనెడి-
కుక్కుటరవమ్ము తోచనేగుడులఘంటి
కాధ్వనులొ ! వచ్చుచున్నవి గాలియలల



కథానిక:

# ఆచారి

—శ్రీలత

మా వూరిలో చాలా మందికి ఆచారి అంటె సదభిప్రాయం లేదు. అందుకు అనేకమైన కారణాలు వున్నాయి. అతనికి యూనివర్సిటీవారు 'పట్టభద్రుడు' అని వేసే ముద్దర ఏమీ లేదు. పైగా నిర్మొహమాటంగా చెడుని చెడని చెప్పేస్తాడు. చిన్నప్పటినుంచి అల్లరిచిల్లరిగా తిరిగే వాడు కాబట్టి అతనిని ఒక రౌడీగా మాత్రం ముద్రించారు మా వూరి పెద్దలు. ఆముద్దర చెరుపుకోటానికి అతను ప్రయత్నించడు.

ఆచారితో ఎవరన్నా ఒక అరగంట మాట్లాడితే అతని మీద 'పెద్ద రౌడీ అనో లేక గర్విష్టి' అనో అభిప్రాయం కలుగుతుంది. ఒక రోజు అతనితో కలిసివుంటె ఇతనిలో కొంత మంచికూడావున్నదనే అభిప్రాయానికి వస్తారు. ఇక ఒక ఏడాది పరిచయం కలవారికి ఇతను ఈ కాలంలో వుండవలసిన వాడు కాదు అనిపిస్తుంది.

ఆచారి ఎప్పుడు ఒక నిక్కరు, లాల్చి వేసుకొని తిరుగుతూవుంటాడు. ఎంత ఖరీదుగల సిగరెట్టు ఇచ్చినా అతను కాల్చడు, బీడి ఇస్తే బ్రంహానంద పడతాడు. అతను అరవ అతను అని వూరిలో ముప్పాతిక మందికిపైగా తెలియదు. అతను తెలుగు అంత స్వచ్ఛంగా మాట్లాడతాడు. వూరిలో అందరికి అతను కార్పెంటరని మాత్రం తెలుసు.

ఈ మధ్య జరిగిన చిన్న సంఘటనని ఇప్పుడు రాస్తున్నాను. విచిత్ర మనస్తత్వంగల ఆచారి మనస్తత్వాన్ని పాఠకులు ఏ విధంగా అర్థం చేసుకుంటారో మరి. నాతో ఏకీభవిస్తారని ఆశిస్తా.

'ఏమయ్యో ఆచారి ఆగవయ్యో బాబు' అని కేక వేశాను ఇరవై మువ్పైగజాల ముందర వెళ్తున్న ఆచారి నుద్దేశించి.

'నువ్వా బాబు రా రా' అన్నాడాచారి వెనక్కి తిరిగి చూసి. మెల్లగా వెళ్లి ఆచారిని కలుసుకొని 'ఎక్కడికయ్యో అప్పుడే బయలు దేరావు' అని అడిగా.

అయితే శుభవార్త; ఇవ్వాళనాకోమంచి పేషంటు దొరికాడు 'డిస్పెన్సర్ ఉడిపి' కి తీసుకు వెళ్ళి జబ్బు కుదిర్చాను. అందుకని మనకిచ్చిన బేటా అట్లాగే వుండి పోయింది. కనుక నువ్వునన్ను క్లయింటుగా చేసుకొని కచ్చేరి లంచ్ హోమ్‌కి తీసుకు వెళ్ళు, ఫీజుగా పావలా ఇస్తా' అన్నా నేను.

'పేమెంటు దొరికాడంటున్నావ్ పదణాలకి పైగా చేపావాబిల్లు?'

"ఆఁ అందుకే పేషంటు అయాడు. పావలా సమర్పిస్తున్నాగనక క్లయింటయ్యా'

'అయితే ఇంకెందుకు పదా' అన్నా డాచారి లంచ్ హోమ్‌కి దారి తీస్తూ.

ఇద్దరం వెళ్లి హోటలులో చెరోకుర్చీలో కూర్చున్నాం 'అయ్యా వైద్యనాథన్ ఒక కాఫీ రెండు చేసి పట్టుకూరా' అన్నాడాచారి సర్వర్ వైద్యనాథన్ నుద్దేశించి.

'కాఫి ఎమిటయ్యా వడాగిడా తీసుకో పావలా వుందిగా' అన్నా నేను

'ఉంచు తొందర పడతావేం?' అన్నా డాచారి.

సర్వరు ఒక కాఫీ రెండు గ్లాసులలో పోసి మాముందు పెట్టాడు.

"కారం ఏదయ్యా రోజు కొత్తేనా" అన్నాడాచారి.

సర్వరు మాట్లాడకుండా లోపలికి వెళ్ళి ఒక గుప్పెడు మిక్శ్చర్ తెచ్చి ఇద్దరికి సర్దాడు.

"అయ్యరు సొమ్ము పెట్టటాని కేడుస్తావేం? నీ సొమ్ము అయితే అసలు పెట్టేటట్టు లేవే" అన్నా డాచారి నవ్వుతు.

సర్వరు ఇచ్చిన కాస్త మిక్శ్చరు నోట్లో పోసుకొని కాఫీ తాగాం. సర్వరు బిల్లు తెచ్చి ముందు పెట్టాడు. బిల్లు తీసుకున్నా.

"బిల్లు మాత్రం అడక్కుండానే ఇస్తాడు. అసలు కింగటి జన్మలో ఈ వైద్యనాథన్ అయ్యరుకి పెద్ద కొడుకయి వుంటాడు" అన్నాడాచారి.

బిల్లు ఇచ్చి ఇద్దరం బయట పడ్డాం.

"ఆఁ బాబు నీ దగ్గిర బేడా వుందిగా" అన్నాడాచారి మెట్లుదిగుతూ.

"వుంది ఏం?" అన్నాను నేను.

"మన దగ్గిర బీడీలు నిండు కున్నాయ్. ఆ బేడా బీడీలు తీసుకో" అన్నాడు. పక్కనే వున్న సుబ్బారావు కొట్లో బీడీలు తీసుకొని ఆచారికి ఇచ్చా. ఇద్దరం చెరో బీడీ అంటించి బయల్దేరాం.

"ఇక మన ప్రోగ్రామ్ చెప్పుబాబు" అన్నా నేను.

"నాకు బజారులో ఏం పని లేదు షికారు పోదాం అంటే రెడీ" అన్నాడాచారి ఇద్దరం ఆంజనేయస్వామి గుడివేపు బయల్దేరాం. ఆ ప్రక్కనే వున్న పార్కులో కూర్చుందామని గుడి దగ్గిరకు చేరేటప్పటికి పార్కులో రేడియోనించి రణగొణ ధ్వని వినిపించింది. బహుళ రెండు స్టేషన్ల ప్రసారాన్ని కలిపి వినిపిస్తున్నట్టుగా వుంది.

"ఈ గోలలో ఎలాకూర్చుంటామయ్యా" అన్నా ఆచారితో.

"అయితే పా ఇంకోచోటు చూద్దాం" అన్నాడాచారి ఇద్దరం బయల్దేరాం.

"ఏమిటయ్యా సంగతులు" అని అడిగా మౌనంగా నడుస్తున్న ఆచారిని

"ఏమున్నాయ్. నరజాతిచరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అన్నాడాచారి. సీరియస్‌గా.

"ఏమిటయ్యోవ్ నీకేదో కడుపుమండినట్లు వుందే చూస్తే" అన్నా నవ్వుతూ

"మండదుటయ్యా, రూపాయిచూసి వారం అయితే" అన్నాడాచారి.

"ఏం? ఈ మధ్య ఎవరూ డబ్బులు పంపించలా?" అని అడిగా.

"ఎందుకు పంపలా అప్పుడేస్వామా. ఇప్పుడు పంపాల్సిన వాళ్ళు ఎవరూలేరు" అన్నాడాచారి.

"అయితే ఎట్లా? కాలేజీవాళ్ళకి కుర్చీలుకావాలట అదేదో చూడరాదు" అన్నా

"అబ్బే మనకేమి లాభంలేదు. అసలు సరస్వతివుంటే లక్ష్మి, లక్ష్మి వుంటె సరస్వతి వుండదయా" అన్నాడాచారి. ఆరిపోయిన బీడి పారేస్తూ.

"ఇంకేం సరస్వతిని వదలి లక్ష్మినిచూడు" అన్నా నేను.

"ఆమె అంత తొందరగా చిక్కదు అందుకు నెత్తురు చెడాలి" అన్నాడు.

ఇంతలో మాపక్కనుంచి ఎవడో కుఱ్ఱాడు సైకలు మీద స్పీడుగా వెళ్ళాడు 'అయ్యో నెమ్మది. పడితే పళ్ళూడతాయ్' అన్నా నేను. 'వూడితే మళ్లీరావు' అన్నాడాచారి 'గీత' బోధిస్తున్నట్లుగా.

ఇంతలో మహిళా మండలి వచ్చింది. జనం గుంపులు గుంపులుగా చేరివున్నారు. ఇకడ దేదో జరుగుతోంది రాన్ పద' అన్నాడాచారి

ఇద్దరం మండలిలోకి వెళ్ళాం. మండలిజనంతో కిక్కిరిసి వుంది. లోపలచోటు లేక చాలా మంది గుమ్మంలోనే నిలబడి వున్నారు. ఎక్కడన్నా కాస్తచోటు దొరుకుతుందేమోనని మండలి చుట్టు ప్రదక్షిణ చేశాం. చివరకి ఒక కిటికీ దగ్గిర కాస్త నిల్చోటానికి చోటు దొరికింది. మేము సందు చేసుకొని కూర్చో టానికి చోటు చేసుకున్నాం.

లోపల ఎవరో ఉపన్యాసం ఇస్తున్నారు. ఆయనెవరో తెలియక అచారిని అడిగా. అతనికి తెలుసేమోనని.

'గొప్పరచయితలే' అన్నాడాచారి.

'గొప్ప అనేది కేవలం రచనలమూలంగానే వచ్చిందా?'

'ఉస్ విను' అన్నాడాచారి.

'...పతజగారు మీ అందరికి బాగా తెలిసే వుంటారు. వారిగురించి మీకు నేను ఏమీ చెప్పనక్కర్లేను. ప్రతికలతో పరిచయంవున్న ప్రతి పాఠకుడికి వారు తెలిసే వుంటారు. ఆమెగారిని ఈనాడు ఇక్కడ కలుసుకుండే అదృష్టం నాకు కలుగుతుందను కున్నా. కాని ఆ అదృష్టం నాకు లేక పోయింది.'

'అని ఆయన చెపుతున్న మాటలు వింటె నాకు మతి పోయినట్లయింది' 'అచారి' అన్నా, 'విను విను' అన్నాడాచారి.

ఇంతలో అధ్యక్షుడుగా కూర్చున్న చైర్మన్‌గారు అంతిమోపన్యా సానికి లేచారు. వారిధోరణి మరీ వింతగావుంది నాకు.

'శ్రీ రెడ్డిగారు మన వూరు రావటం మన అదృష్టం. వారి గురించిన వివరాలన్నీ వారే చెప్పారు. ఇది విన్ననాకు శ్రీ రెడ్డిగారు గొప్ప రచయిత ఎలా అయింది అర్థమైంది.' శ్రీ రెడ్డిగారన్నట్లు పతజగారు మన వూరి వారు కావటం నిజంగా మన అదృష్టం. ఆమెగారిని ఈ రోజు హృదయమే కలుసు కొని ఉపన్యాసకులుగా వుండమని ప్రాధేయ పడ్డాను. కాని వారు కొన్ని అనివార్య కారణాల వల్ల రాలేక పోయారు. లేకపోతేవారిని ఇక్కడే మీకు పరిచయం చేసి వుండేవాణ్ణి. ఈరోజు శ్రీ రెడ్డిగారితో పాటు వారికి సన్మానం చెయ్యాలను కున్నాం కాని'

'వారి వోటు మీ వార్డులో లేదా' జనంలో ఒకరి అరుపు. 'ఇవి సారస్వత సభలు ఇందులో రాజకీయాలకి ప్రమేయంలేదు' అది ఎవరి ఉవాచొ'

'మీరు నిశ్శబ్దంగా వుండాలని నామనవి ఇంతకీ ఎందుకు చెప్పానంటే వారు అంత Simple గా వుంటారు.'

నేను మళ్ళీ ఆచారి వంక చూశా. ఆచారి కళ్ళుతుడుచు కుంటు కన పడ్డాడు. అది ఆనందమో దుఃఖమో.

'ఆచారి' అని పిలిచా

బరువుగా నిట్టూర్చాడాచారి.

నాకు కోపం ఆగలేదు 'ఆపండి' అని గట్టిగా అరిచా. నా అరుపుకి అంతా నావంకకి తిరిగారు. ఈ ప్రెసిడెంట్ గారు చెప్పేది అంతా అబద్ధం. ఆయన పతజని కలుసుకోలేదు. పతజ అంటే ఎవరో కాదు ఈయనే అంటూ ఆచారివంక తిరిగా. ఆచారి అక్కడ లేదు. 'ఆచారి' అన్నగేటు దాటుతున్న ఆచారిని చూసి.

"ఎవరో పిచ్చివాడులే" అన్న మాటలు వినిపించాయి జనంలోనించి



'మనమంతా ఒకటే'

శ్రవ్యనాటిక ది. 10.9.60న ప్రసారమైన రేడియో రూపకానికి తొలిరూపం

— ఆకాశవాణి సౌజన్యంతో

వ్యాసము:

# ఆముక్త మాల్యద

—శ్రీ పప్పూరి రామాచార్యులు

(గత సంచిక తరువాయి)

## రాజ నీతి

నృపుడు అపరాధి మీద విరుచుకపడ గూడదు. వాని చెఱుప సమయము వచ్చు వరకును రోషము నణచుకోవలెను. గురికాడు లక్ష్యసిద్ధిదాక బాణమును లాగి పట్టుకొని తర్వాత గురి దాకునట్లు విడుచును గదా?

కుత్సిత శత్రువు మీద గూడ తలచుకొన్నప్పుడే దండెత్తి పోకూడదు. వెనుక క్రొత్తనీరు త్రోసికొనిరాగా ఉబ్బి ముందు ముందుకు జరుగు ప్రవాహము వలె తన సైన్యములు వెంట వెంట కలిసికొని రాగా లావెక్కి లఘు ప్రయాణములతో వాని రాజ్యము నాక్రమింప వలెను.

శత్రువు జయింపరాని బలశాలి అయ్యేనా వాడు సేయు ఉపచారములకే తృప్తుడైనట్టుగా మరలి రావలెను. నీ వేగులవారు కడు బలహీనుడని తెలియ జెప్పగా వెనుదిరుగక వాని నాక్రమింప వలెను.

ప్రజలు నొవ్వ పన్నులు గొనుట, దేబలతో మంత్రాలోచన చేయుట, తన భూమిని కొంత శత్రువుల పాలు పరచి వారితో సమాధాన పడుట ఆప్తులగు తన సామంతులను సంశయించుట ఇత్యాది దోషములకు శత్రురాజు గురియైనప్పుడు ఆ యదను కనిపెట్టి వాని జయింపదలచు రాజు, అసంతృప్తులై లోలోన కినియు వాని సామంతులకు రహస్యముగ మణి భూషలు పంపి వారిని తన వైపున కాకర్షించుకొని శత్రువును భేదించ వలెను. అట్టి దోషములు తనయందు లేకుండ జాగ్రత్త వహింపవలెను.

ప్రబలుడైన అంతః శత్రువు వేడినప్పుడు భూధవుడు తా నేలెడి మహితో సగమైన నిచ్చి తెగనిమైత్రి సంపాదింపవలెను. లోపగతువలని భయము పాము భయమును మించినది.

వేయిపలుకులేల? పార్థివుడు తన రాజ్యములోని గూఢ శత్రువులను సాధ్యమైనన్ని విధముల చేతను కనుగొని వారి నణంచి చంచలాపుల

బృందమున సంచరించు పురుషునివలె నిర్భీతుడై మెలగుచుండుటయే రాజ రికపు ఫలము. కాకున్న యెడల రాజ్యము దుఃఖలబ్ధికే యగును.

బెదరి తనవైపు చేరజంకెడు బలియుని బిగియపట్టి ఈడ్చుకొనరాదు. వాడు పోయినట్లే పోనిచ్చి తనకుదానై వచ్చుగాక ఓర్పి లోగొనవలెను. గాలరి బలిష్ఠమైన చేప చిక్కి వెనుకకు లాగుచుండెనా దానిని కొంత దవ్వు పోనిచ్చును. అది పూర్తిగా గాలము మ్రింగెనా వెంటనే లాగి కట్టునకు ఈడ్చును గదా!

ఈ క్రింద వివరించిన రాజ దోషములను నృపాలుడు చేరనియ్య రాదు :-

దండపారుష్యము, నిజమరయక కొండెముల నమ్ముట, శత్రువు సంధి కోరినప్పుడు అంగీకరింపక వికటించుట, తన ప్రభువుతో కలహించి వచ్చిన వైదేశికుని చెఱచుట, ప్రతి కూలుడైన మంత్రికి తేటపడునట్లు ఆలోచన జరపుట, నమ్మదగనివారని ఎఱిగియు వారిలో కలిసి వ్యవహరించుట, నమ్మదగిన వారిని దూరము సేయుట, మంత్రాలోచన సమయమున దాక్షిణ్యమున లొంగిపోవుట, రహస్యమును వెలిపరచిన వానిని శిక్షింపక ఉపేక్షించుట, ఉత్పాతములు కలిగినప్పుడు మొలకువతో వానికి ప్రతి సేయకుండుట, మాన్యుల యెడ ఏకరీతిగా ప్రవర్తింపకుండుట. నీచ సహవాసము, సప్తవ్యసనములకు లోనౌట ఎవ్వని మీదగాని చలముపట్టుట, ఇత్యాదులు.

దివ్యాంతరిక్ష భౌమములనెడి త్రివిధ ఉత్పాతము లుదయించినప్పుడు ప్రభువు బ్రాహ్మణులకు సంతర్పణ, దేవతలకు బలిదానము అగ్నికాహుతులు మూలముగా వానిని నివారించుకోనగును. అందున కగు వ్యయమును గూర్చి చింతింపరాదు.

నృపుడు తన రాజ్యములోని దొరలందును యోధులందును స్పర్ధ రేపవలెను. అట్లయినప్పుడు రాజుమీద వారు చేయదలచిన కీడు మేల్లు దాగవు. రాజాభిమానమును గౌరవమును సంపాదించుటకు వారు ఒకరిని మించి ఒకరు ప్రయత్నింపుదురు. కావున ప్రభువు మీద ద్రోహచింత తలంచుటకు వారి కవకాశముండదు. ఎందునేని ధరణిపుడుతానే ఎత్తిచన జనదు. ఒక్కని దొరగాచేసి పంపదగును. శత్రువు దుర్బలునిచేత చెడదు. కావున ఎత్తిచను దొర భూకరితురగ ధనసమృద్ధి లేకున్న ప్రయోజనమునకు రాదు. కావున వానికి [illegible]

ఇయ్యవలెను. బ్రాహ్మణునికిగాక ఇతరున కిపి ఒనగూర్చినయెడల వాడు రాజుమీదనే అలిగి తిరుగబడుటయు సంభవము. కాని అట్టివారును అక్కఱకు వత్తురు గావున వారినీ చేఃట్టియే యుండవలెను.

రాజు తన దేశపు ఎల్లలలో అరణ్యములను దట్టముగా పెంచవలెను. తన దేశ మధ్యమునగల అడవులను, దొంగలు బందిపోట్లు అందు చేరి ప్రజల కుపద్రవము కలిగించకుండు కొఱకు నిశ్శేషముగా కొట్టి వేయించవలెను.

దుర్గమ ప్రదేశములందలి మన్నెపు జనులందు తప్పిదము లెన్ని శిక్షింప బూనినచో దానికి తుద ఉండదు. మట్టిగోడ నెంత కడిగినను మురికి పోనట్లు వారినెంత దండించినను తప్పిదములు నిశ్శేషముగా పోవు. బహుమతి ప్రదానములచేతను సత్యము చేతను వారిని వశముచేసికోవచ్చును. అట్లు చేసి వారి చెలిమిని సంపాదించినయెడల శత్రురాజుల మీద దండెత్తినపుడు వారు సాహాయ్యపడి పొలిమేర శత్రురాజుల భూములను కొల్లగొట్టుటకు పనికివత్తురు.

నూరుగురు అపరాధములకు వేయిమందిని శిక్షించుట సర్వము నేలెడి రాజునకు తలంపకూడనిది.

జాతి గుఱ్ఱములు ఏనుగులు లోనగు వానిని తెచ్చి అమ్మెడి దూర ద్వీపవర్తకులకు నగరమున రమణీయ గృహములను, జాగీర్లను ఇయ్యవలెను. కొలువున మంచి మర్యాద నొసగవలెను. ఆ గజాశ్వములను కొనుటలో వారికి వెలమేలు (లాభము) ఇచ్చి చిరపరిచితులుగ చేసికొందు రేని అవి శత్రురాజ్యముల చేరకుండును.

కొలువునందు విదేశ రాయబారులతో రాజు సరసల్లాపము లాడవలెను. కార్యము తెలుగు ఖడ్గ ప్రసక్తి తన ఉద్యోగులు చర్చించి వారిపై జేసెడి దోషారోపణలను రాజు మైత్రి కనుబరచుచు తేల బలుకవలెను.

క్రొత్తగా కొలువిచ్చిన దొరను వేగపడి మంత్రాలోచనలో చేర్పరాదు. తనకు కలిగిన క్రొత్త మన్ననకు వాడు ఉబ్బి తన స్నేహితులకు చెప్పును. అందువలన కావచ్చిన కార్యము చెడును. మంత్రము బయలు పుచ్చిన దొరయును పదచ్యుతుడై చెడును.

(సశేషము)

# మధురస్మృతి

— శ్రీ ఆర్. కె. మొగసాటి

ఈ నడిరేయి
ఈ కాఱు చీకటి జడల నడుమ
ఈ క్రూర ఘోర మృగ గర్జనల మధ్య
పడగ విప్ప సహస్ర ఫణులు
శత సహస్రాలుగా కదలి
'కస్సు, కస్సని' లేచి
పగబట్టి ప్రగతిపై
బుసగొట్టు సమయాన
కనుపించదేమి నాటి క్రొందళుకు మెఱుపు?

ఈ వడలో
వడి వడి
విడబడి పోయే
నా నడవడిలో
యీ జీవితపు ఎడారిలో
ఈ తృష్ణా, ఆ మృగ తృష్ణల నడుమ
అటు పూర్వంగా
అపూర్వమై బులిపించె
తేనెపట్టువంటి సీటిపట్టు కనుపించదేమి?

ఈ లోకంలో
ఈ నవ నాకంలో
కలిదోచి ఆకలికి
బలికాలేని బలహీనతతో
నే పొలికేకలు వేసే తరుణంలో
కన్ను విప్పి — నన్ను జూచి

కాల్వలుగా కరుణపొంగి
కనురెప్పల గట్లు దూకి
ప్రవహించిన హృది యెటు పయనించెను ?

కలుకు కత్తుల
పగర కుత్తుక
ఉత్తరించే వేళలో
చిత్తురొత్తుగ నెత్తురుల్
పొంగి పొరలగ నున్న భువిలో
విశ్వ విలయపు లయకు వెలిగా
శాంతి గానం చేయవచ్చిన
సాధు జీవనుడేడి చెపుమా ?
సహన సూత్రపు మిత్రుడేడి ?



వ్యాసము:

# కవిరాజు - జీవిత విశేషాలు

—శ్రీ త్రిపురనేని సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

ఇసుక వేసినా రాలని జనసమూహం విచారవదనాలతో కవిరాజు భౌతిక కాయం వెంట నడిచారు. మహాకవి భౌతిక దేహాన్ని కడసారిగా కన్నులారా చూడాలనే కాంక్షకొద్దీ, వేలాది ప్రజలు తండోపతండాలుగా గుమిగుడారు. అది మహా ప్రస్థానము.

'రామస్వామి చౌదరిగారు పది సంవత్సరా లుంటే ఎంత బాగుండేది!' అంటున్నాడు ఆ త్రోవనే పోతున్న రైతు తన కళ్ళు తుడుచుకొంటూ.

'రామస్వామి బాబు పోయాడా!' అంటూ నోరు తెరచి అలాగే వుండి పోయాడు ప్రక్కనున్న ఓ ముసలాయన.

'చౌదరిగారు తన జీవితమంతా నిస్స్వార్థ సేవతో ఆంధ్ర ప్రజలకు ధారబోశాడు' అంటున్నాడు ప్రక్కనున్న ఒక యువకుడు తన ఎడమ చేతితో కళ్ళజోడు తీస్తూ.

'తెలుగు సాహిత్యంలో కొన్ని శతాబ్దాలుగా పూరించలేని అగాధం ఏర్పడింది' అన్నాడు మరో తెలుగు పండితుడు.

ఇంతలోపల శ్మశానవాటిక వచ్చింది. అచ్చట శ్రీ పండిత మద మోహన విద్యాధర్ గారు వేదోక్తంగా దైవ ప్రార్థనతో అంత్య క్రియలు జరిపించారు. కవిరాజు లేని సూతాశ్రమం వెలవెల బోయి కళా విహీనమయింది.

కవిరాజు నిర్యాణంపట్ల అనేకమంది ప్రముఖుల చేతనూ, వివిధ పత్రికల చేతనూ వారి కుటుంబానికి సంతాప సందేశా లందించ బడ్డాయి.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు తమ సంతాపాన్ని ఇలా వ్యక్తీకరించారు. 'రామస్వామి చౌదరిగారు పరమపదించారన్న వార్త విని నిర్ఘాంత పోతిని. నామిత్రులలో ఇంతటి శుద్ధ వర్తనుడు మరియొకడు లేడు. సంస్కృతములో మంచి భాషా పరిజ్ఞానము కలవాడు. ఆంధ్ర భాష ఇతని కలమునకు స్వాధీన పడినట్లు మరియొక ఆధునిక కవికి స్వాధీన పడలేదని నా నమ్మకము. జాతీయ మైన శుద్ధాంధ్రమును వ్రాయగలవాడు తిక్కన తరువాత ఇతడే. 'బ్రహ్మద్వేషి' యని ఈయనకు పేరుగలదు. పలువురు బ్రాహ్మణులకు గల శూద్రద్వేషమున కంటే ఈయనకు బ్రాహ్మణద్వేష మెక్కువ లేదు. వేదఋషుల మతములో అందరకునూ హక్కు గలదనియు, ఇది కూడదనుట బ్రాహ్మణుల స్వార్థపరత్వమనియూ ఆయన విశ్వసించువాడు. ఇదియే బ్రహ్మద్వేషమైనచో ఇట్టి బ్రహ్మద్వేషము గలవారు పలువురు బ్రాహ్మణులుగూడా గలరు' (ఆంధ్ర పత్రిక 1943 జనవరి 20)

'రామస్వామి చౌదరిగారు ఆకస్మిక మరణంతో ఆంధ్ర సారస్వత ప్రపంచనభోమండలమున ఉజ్జ్వలదీప్తితో వెలిగిన తేజఃపుంజమగు నక్షత్ర మొండు జారి పోయినది. అది మన దురదృష్టము' (ఆంధ్ర ప్రభ 1943.)

చౌదరిగారు స్వర్గస్థులవడంతో 'తెలుగుదేశం తన సౌఖ్య, సౌభాగ్యాల కోసం సతతం తపించే ఒక అనుంగు తనయుని కోల్పోయింది. తెలుగు జాతి మౌఢ్యాంధకారాన్ని అవలకు నెట్టి, ఉజ్వలమైన వెలుగును తనకు సమకూర్చ యత్నించే ఒక క్రాంతికారుని కోల్పోయింది' (ఆంధ్ర జ్యోతి 1943)

కవిరాజు, విప్లవవాది, శ్రీ రామస్వామి చౌదరిగారు మహాప్రస్థానం చేయడంతో 'నాడు పారిజాతాన్ని కోల్పోయిన దేవతలకు కలిగిన గుండె దిగులు, నేడు తెనుగు పారిజాతాన్ని కోలుపోయిన లోకానికి కలుగుతుంది. వీరి భౌతిక శరీరం ఫ్రెంచి విప్లవంలా అంతరించ వచ్చును. కాని ఫ్రెంచి విప్లవజ్యోతి వలెనే వీరి ఆశయాన్ని, ఆదర్శాన్ని అభ్యుదయం కోరే ఆంధ్ర జగత్తు విస్మరింప లేదు' (దేశాభిమాని 24-1-43.)

కవిరాజు కర్షక కుటుంబానికి చెందినా, కర్షకుల అభివృద్ధినే గాకుండా మార్క్సు మహాశయునివలే వివిధ కులాలలోని పీడిత ప్రజానీకాన్ని, అగ

జాతుల బానిసత్వంనుండి రక్షించిన మహామేటి, గొప్ప సంస్కర్త, కార్యశూరుడు, నిశిత విమర్శకుడు. రామస్వామి చౌదరి లాంటి విశిష్టతగల వ్యక్తులను వ్రేళ్ళపై లెక్కించవచ్చును'- గోలకొండ 1943

'సనాతనత్వంతోనూ, అర్థంలేని అంధ విశ్వాసాలతోనూ, కరడు గట్టుకు పోయిన సంఘంలో ఒంటరిగా నిలిచి, ధైర్యసాహసాలతో శంఖాన్ని పూరించిన విప్లవకవి మన కిక లేడు. పటికి ఎదురీది, తన ఆదర్శమే ప్రధానంగా చైకొని కలంచేత పట్టి, ఎదురొచ్చిన మహామహులను పిట్టలు గొట్టించిన కార్యశూరుడు, సాహసి, స్వాతంత్ర్య ప్రేమి ఇక కనుపించడు. పూర్వ గ్రంథాల్ని, పూర్వవేదాంత మతబోధల్ని, పూర్వాచారాల్ని దూయబట్టి, కుళ్ళుతూవున్న సమాజానికి కాలానుగుణ పరిణామవాదాన్ని ఋజువు చేసి, చూపి, తన వ్యక్తిత్వ ధర్మాన్ని నెరవేర్చిన అగణిత ప్రతిభాశాలిని మన మెప్పటికినీ చూడజాలము'

- ఆంధ్రా లేబర్ 24-1-43

మరో పత్రిక 'రామస్వామి చౌదరిగారు మానవ ధర్మ రక్షకుడు' అని ప్రశంసించినది.

రామస్వామి చౌదరిగారి అస్తమయంతో 'ఆంధ్ర దేశంలో సాంఘిక-మత-విద్యా ప్రపంచకములలో ఒక విప్లవనాయకుడు అంతరించి పోయాడు'

- జమీన్‌రైతు 29-1-43.

శ్రీ గుమ్మిడదల వెంకట సుబ్బారావుగారిలా తమ సంతాపాన్ని తెలియజేశారు: 'కవిరాజు, కమ్మకులోద్భవుడు, హిందూమత సంస్కర్తయగు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు దివంగతులైనారు. అహో! ఏమి దురంతము? సూతపురాణ కర్తనిక భౌతిక శరీరమున చూడ జాలమా? ఓ ఆంధ్ర దేశమా? ఎంత దౌర్భాగ్య స్థితికి వచ్చితివి! మిత్రుని ఆత్మతద్వారా తెనుగు సాహిత్య మత విజ్ఞానముల తరించుగాక!' అనేకమంది కవులూ, రచయితలూ కవిరాజు నిర్యాణం పట్ల కన్నీటి ధారలు గార్చారు. శ్రీ యడ్లపల్లి దేవయ్య చౌదరిగారి 'కన్నీటిధార' చూడండి:

* ములుకోల 1-2-43

'ప్రాతగాథకు వడపోత పోయగవచ్చు
సూతాశ్రమములోని సుగుణుడేడి
బుధవరేణ్యులు మెచ్చిపొంగి పోయెడినూత్న
భావోన్నతిని జూపు ప్రముఖుడేడి
తెలుగు భాషకు క్రొత్త తెన్నులన్ జూపించి
విప్లవంబును దెచ్చువీరుఁడేడి
జాతీయ కవనంబు చలపట్టియున్నందు
చాటి చెప్పెఁనన్న చతురుడేడి

కట కటా! యిది యేనాటి కర్మమమ్మ
అంధకారమాంధ్ర కవిత నావరింప
తెలుగువారల గుండియల్ దిగ్గురనగ
జేసితివి మృత్యువా! యిట్టిచేత తగునే?

రామస్వామి చౌదరిగారి లాంటి వ్యక్తి 'నభూతోనభవిష్యతి'



గేయం:

# ప్రభూ!

—శ్రీ ఐ. శేషగిరిరావు

ఈ జీవిత ప్రాంగణాన
తేజో విలసిత రేఖలు
ఏ కొంచెము వెలుగు నించునా -
ఎన్నటికైన ? ప్రభూ !

యీదరిద్ర నారాయణు
డాద మరచి కనులుమూసి
ఏ తీయని స్వప్నశకల
మెన్నటికైనా కనునా ?

ఈ యగాధగాధలోన
ఇరికి నరుకు వడినయెడద
ఎటులో యతుకువడి తిన్నగ
నెన్నటికైనా మనునా ?

బాధాలస చలితకవిత
బ్రతుకుకు మసిపూతయగునా ?
చిన్నిమధురగేయ మొకటి
ఎన్నడైన వెలువడునా ?

కళల కలలు మురువు నింప
కలల కళలు బరువుబెంప -
నలిగిపోవు బ్రతుకుపూవు
నాదరింపలేవా - ప్రభూ ! !

పుస్తకపరిచయము :

# తెలుగు కావ్యమాల

(కవితా సంకలనము)

సంకలనకర్త :
శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

ప్రచురణ :
సాహిత్య అకాడెమి, న్యూఢిల్లీ

వెల : రూ. 7—50—

ప్రతులకు :
త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము

ఆంధ్రసాహిత్యంలో కాల్పనికోద్యమం నాయకులొకరు నవ్యకవితోద్యమాన్ని సమీక్షిస్తూ "వెంకటశాస్త్రి మొదలుకొని అతినవ్యునిదాకా అందరూ ఒక మహా పరిషత్తులో సమావేశమయి కవి ప్రజాపత్యము స్థిరపరుస్తే బాగుండును." అన్నారు, ఒక మారు. అలాంటి మహా పరిషత్తు మన సాహిత్యకులకు లభ్యమైందో చెప్పలేము గాని భారతసాహిత్య అకాడమీవారు ప్రచురించిన ఈ కావ్యమాలలో నన్నయ్య మొదలు నారాయణరెడ్డి వరకు వెయ్యేండ్ల సాహిత్యంలోని మూడు యుగాల కవులు నూట పదునొండుమంది ఒకే సాహితీపీఠంలో సమాసీనులై వున్నారు. ఇది వెయ్యేండ్ల తెలుగుసాహితికి దిక్ప్రదర్శిని.

తెలుగులో కవితా సంకలనములకు కొదువలేదు. వ్యక్తులూ, సంస్థలూ ఎవరికి తోచినరీతిగా వారు కవితా సముచ్చయములను పాఠకలోకానికి అందచేశారు. అయితే అవన్ని ఒక కాలానికో లేక ఒక ప్రాంతానికో పరిమితమై వున్నాయి. కాని యావదాంధ్ర ప్రాచీన, మధ్యయుగ, నవీన, సమకాలిక కవితలు అన్నీ ఏకమాలగా గుచ్చడం ఈ "తెలుగు కావ్యమాల" తోనే జరిగింది. అంటే ఒక విధంగా ఇది సమగ్రమైన సంకలనమని చెప్పవచ్చు. ఏ కవితా సంకలనమైనా దానిని కూర్పుచేయువారి వ్యక్తిత్వాన్ని బట్టి, వారి అభిరుచిని బట్టి, పరిశీలనా శక్తిని బట్టి రూపొందుతుంది. ఈ కావ్యమాలను సిద్ధపరిచేపనిని అకాడెమీవారు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారికి అప్పగించడం సముచితమైన నిర్ణయమని సర్వులూ అంగీకరిస్తారు. వారు సరసకవులు. రసదర్శనం చేసుకున్న వారు. ఆంధ్ర సాహిత్య ప్రవంతి అడుగడుగు నిశేషంగా ప్రవహించిన తీరు తెన్నులను చూడగల్గినవారు. పైగా పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధభాగంలోను, ఇరవయ్యోశతాబ్ది పూర్వార్ధభాగంలోనూ కాలపురుషుడు ప్రసన్నంగావున్న కాలంలో ఆంధ్రావనిలో వెల్లివిరిసిన సాహిత్య, కళా సంపదను ఎరిగినవారు. కాబట్టే ఈ కావ్యమాలకు వారు వ్రాసిన "నివేదనము" లో ఆంధ్రసాహిత్యం రాజరాజు ఆస్థానంలో సర్వాంగసుందరంగా దర్శనమిచ్చింది మొదలు నేటివరకు ఎన్నెన్నిపోకడలు పోయిందో చక్కని సింహావలోకనం చేశారు, "దేశభాషలందు తెలుగులెస్స"

అన్న కృష్ణదేవరాయల పద్యము, తిక్కన్న హరిహరనాథ తత్త్వమును గూర్చి చేసిన స్తుతిపద్యములు ఆరంభంలో ఉదహరించి సత్రారంభం చేశారు.

ఈ కావ్యమాలను వారు మూడు పేటలుగా గుచ్చారు. క్రీ॥ శ॥ 1000 మొదలు 1500 వరకు వెలువడిన సాహిత్యం మొదటి పేట. 1500 మొదలు 1850 వరకు నడచినది రెండవపేట. 1850 మొదలు నేటివరకు దొరకేది మూడవపేట. ఇలా ఇది మూడుభాగాలుగావుంది. ఇందులో నన్నయ కుమారాస్త్ర విద్యాసందర్శనము, నన్నిచోడదేవుని కుమారసంభవములోని మన్మథ దహనము, తిక్కన విరాటపర్వములో పాంచాలిని భీమసేనుడు ఊరడిల్లజేయుట, శ్రీనాథుని క్రీడాభిరామములోని పద్యాలు, పెద్దన వరూథినీ ప్రవరాఖ్యులు, నందితిమ్మన సత్యాసాంత్వనము కృష్ణదేవరాయల ఋతువర్ణనములు చేమకూర సుభద్రార్జునులు, క్షేత్రయ్య మువ్వగోపాలపద్యములు, త్యాగరాజుకృతులు, అన్నమాచార్యుల కీర్తనలు, వేమన ఆట వెలదులు గురజాడవారిముత్యాలసరాలు, వేంకటపార్వతీశ్వర కవుల ఏకాంతసేవ, నండూరివారి ఎంకిపాటలు, కృష్ణశాస్త్రి పల్లకి, చలం వచనకవిత, శ్రీ శ్రీ మహాప్రస్థానం, దాశరథి శిల్పిపద్యాలు మొదలైన ప్రసిద్ధ రచనలెన్నో వున్నాయి. ఎన్నిమార్లయినా చదువదగిన కవితలు.

ఇకపోతే 'ఇలావస్తే బాగుండేది' అన్నమాట ఈ సంకలనానికి కూడా రాకతప్పలేదు. ప్రాచీనులైన వారిలో కేతన, జక్కన, మంచన, మారనలకుచోటు చేయవలసింది. అలాగే నవ్యాంధ్రసాహిత్య వికాసానికి మూలపురుషులైన కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, వేదం వెంకట్రాయశాస్త్రి, జనమంచి శేషాద్రిశర్మ వంటివారివికూడా కొన్ని పద్యాలు మచ్చుకువేయవలసింది. అలాగే కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము' లో నుంచి కొన్నిపద్యాలు, వేటూరి ప్రభాకరశాస్త్రి, ఉమరలీషాగార్ల రచనలు కూడా చేర్చినట్లయితే బాగుండేది. తెలుగు యక్షగాన మొకటి వేయవలసింది. ఇక ఆధునికులలో వరాభి, బైరాగి, దిగుమర్తి, కాళోజి, కుందుర్తి, సోమసుందర్ అజంతా, దుర్గానంద్, బెళ్ళూరి శ్రీనివాసమూర్తి, గోపాలచక్రవర్తిగారల రచనలు కూడా చేర్చినట్లయితే సమగ్రంగా అనిపించేది. కాకపోతే ఇంకొక 30 పేజీలు పట్టివుండేవేమో 'స్థలసంకోచం' అన్న కారణం చూపడం బాగాలేదు. ఇలాంటి సంకలనాలు ఎప్పుడూ వేయడం పడదుకదా!

"ఇది ఆంధ్రసాహిత్యమందలి కావ్యభేదాలను రీతులను ప్రదర్శించే ప్రయత్నము" అనీ, అయితే "ఆంధ్రసాహిత్యంలో కేవలం మేలేర్చి కూర్చేయత్నం కాకపోవడంవల్ల కొంత అసమగ్రతకు పాల్పడిఉంటుంది." అనీ సంకలనకర్తలు చెప్పుకున్నారు. మేలేర్చికూర్చే ప్రయత్నం ఎందుకు చేయలేదో బోధపడడం లేదు. కాలావధులుగాని, మరే ఇతర పరిమితులుగాని లేవుకదా. అభిరుచి భేదంఅంటే అది వేరుమాట. ఉదాహరణకు ఉమర్ ఖయ్యాము అనువాదాలలో దువ్వూరి

భూమిరెడ్డిగారినిగాని, రాయప్రోలు వారినిగాని కాక మాధవపెద్ది బుచ్చిసుందర రామశాస్త్రిగారిని తీసుకున్నారు పరవాలేదు కాని రసజ్ఞలోకానికి ఆదరపాత్రములైనవాటిని వదలివేయడం పెద్దలోపంగానే వున్నది. తిక్కన రచనలలో ఉద్యోగపర్వంలోనుంచి, యుద్ధఘట్టంలోనుంచి కొన్ని పద్యాలు వేయవలసింది. అలాగే శ్రీనాథుని శృంగారనైషధంలోనుంచి కూడా. అప్పారావుగారి దేశభక్తిగేయము, పింగళి కాటూరుల తొలకరి పద్యాలు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి గాథాసప్తశతి అనువాదములు, పుట్టపర్తి నారాయణాచార్యుల "శివతాండవము" అబ్బూరి రామకృష్ణారావుగారి "కాపుపాట" దాశరథి "పునర్నవం" గేయాలలో ఒకటి, అలాగే ఆచంట జానకిరామ్ "స్వర్ణసీత" లోనుంచి ఒక చిన్నఖండిక వున్నట్లయితే ఈ కావ్యమాల ఎంతనిండుగా, సుందరంగా వుండేది! వాటిని ఇతర భాషలలోకి అనువదించినా తెలుగుకవుల ప్రతిభ వ్యక్తమయ్యేదిగదా!

ఈ కావ్యమాలను కృష్ణశాస్త్రిగారి "జయగీతి" తో ముగించడం బాగానే వుంది. అయితే భారత జనయిత్రితోపాటు తెలుగుతల్లిని కీర్తించే మరొకగీతాన్ని కూడా దానికిముందుగా వేసినట్లయితే బాగావుండేది.

చివర అనుబంధంలో కవులనుగూర్చిన వివరాలు, కావ్యసూచిక, కవినామసూచిక అకారాదిగా ఇచ్చి పాఠకులకు సౌలభ్యం చేకూర్చారు.

ఈ గ్రంథం మేలైన కాగితంపై చక్కని అచ్చుతో ముచ్చటగొలిపే విధంగా ముద్రించారు. ఈ ప్రయత్నాన్ని తలపెట్టిన సాహిత్య అకాడమీవారికి అభినందనలు. ప్రతిగ్రంథాలయంలోను వుండదగిన కవితాసంకలనమిది. సహృదయుల స్వంతగ్రంథాలలో తప్పకుండా వుండవలసిన సంకలనము.

— డి. ఆర్.

# కైకేయి

1/8 క్రౌను సైజులో 78 పుటలుగల పద్యకావ్యము: రచన శ్రీ చిట్రోలు కృష్ణమూర్తి. వెల రూపాయిన్నర. గ్రంథకర్త పేర గోమాలపాడు, వయా గాదేవల్లి, పల్నాడు తాలూకా గుంటూరు జిల్లా అని వ్రాస్తే పుస్తకాలు దొరకును ఈ కావ్యంలో ప్రధానాంశం కైకేయి పశ్చాత్తాపం ఆమె స్వగతముగా తాను చేసిన అపరాధము గూర్చి చెప్పుకొను మాటలే ఈ కావ్యరూపములో అవతరించాయి. ఈ కవిగారికి చక్కని ధార ఉన్నది. దానితో ధారాళముగా వృత్తములు చెప్పి

దానిలో కథా సంవిధానము చక్కగా ఇమడ్చగల నేర్పున్నది. ఈ నేర్పుతో పాటు వీరికి శ్రీ రామచంద్ర భక్తి కూడ ఉన్నట్లున్నది. కైకేయి ముఖముగా ఆ రామ భక్తిని అక్కడక్కడ ప్రదర్శించుకొన్నారు.

కలరీయుర్విని రాజ పుత్రకులసంఖ్యాకమ్ముగాని కో
మల సుస్నిగ్ధకపోలముల్ చిదిమినం బాల్గారు ప్రాయమ్మునన్
జలదాహమ్ముల చాటునన్ నిలిచి గర్జారావముల్ సల్పుగూ
ర్జుల దుర్వార సురారులన్ దునుము యోధుండెందు గన్పించునే

శ్రీరాముని యోధునిగా, కృపాళువుగా, ధర్మాత్మునిగా, త్యాగమూర్తిగా, సుగుణఖనిగా, సత్యసంధునిగా ఆరుపద్యాలు ముక్తపదగ్రస్తముగా రచించి వీరి భావనా పటిమ చాటుకొన్నారు. ఈ కైకేయీ స్వగతములో పూర్వకథ, దానియందు సంభాషణములు చమత్కారముగా ఇముడ్చి కొంత నాటకీయతకూడ కవి సాధించారు. ఉదాహరణగా చరతుదన్న మాటలు.

నాకేదో యొకగొప్ప మేల్ సలుపయత్నం బింకగావించి కీ
దే కావించిన దానవై తి కడకిస్సీ. పుత్రచేతోహితం
బేకార్యంబొ గ్రహించి వర్తిలగరాదే? పుత్రమోహాన నే
గాకిమ్మాదిరి లోకముల్ కనలు దుష్కార్యంబు గావింతురో ?

ఇలాగ ప్రతిపద్యరసోదయముగా కావ్యము చక్కగా నడిపి చివరికి పశ్చాత్తాపవాక్కులతో కవిగారు ముగించారు.

గుణధాము డైన రాముని మీద మంథర
చెలగికొండెము లేల చెప్పవలయు ?
చెప్పెబో నేదెల్వి చెడినా కుమారు భూ
ధవు నొనర్పగ నేల తలపవలయు ?
తలచితిబో మహోదారుని జానకీ
పతిని గానల కేల పంపవలయు ?
పంపితిబో వనవాసమ్ము ముగియించి
రాడొకో విభుడేల మ్రందవలయు ?
నా నిశాంతా వివేక మింతకును హేతు
వనితపింతునా ? చింతాదవాగ్నిలోన
అంశయును గర్మ వశమున నయ్యోయనుచు
నూఅడిలుదునా ? యొక్క నిట్టూర్పు విడిచి

— శ్రీ వాత్సవ

# ఆనందచేతన

రచన :
శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి

82 పేజీలు

అరుణశ్రీ గ్రంథమాల. 1870-1
సికింద్రాబాదు.
జనరల్ బజారు.
వెల : రూపాయి.

ఆనందస్వరూపుడైన జీవుడు అనాభవము కొరకు సంసార జీవితము కల్పించుకుని, అందులోని అనుభవములతో దుఃఖిస్తాడు. దుఃఖభాజనుడైన జీవుడు తనలోని పరమాత్మ స్వరూపము విస్మరించి పరమేశ్వర స్మరణములో తనయుని వెలుగు గుర్తించుకో గల్గుతాడు, యీ సూత్రం ఆధారంగా రచయిత సప్త ప్రకరణాలలో పద్యాలు వ్రాసారు.

'బాధావ్యధలతో కూడిన ఎడద కల్గిన సాధకుడు శివహృదయంతో సంతుష్టుడగుట తుదకు కన్పించుచున్నది. అజ్ఞాతమయిన వేదన సుజ్ఞాతమయి ఆవేదనముగా మారి స్వసంవేదన రూపం పొందేవరకూ సాధకుడదే విధంగా యాత్ర చేస్తుంటాడు. ఆ యాత్ర దీనిలో ఉన్నది'.

శివుని ఆత్మపతీ అని నిర్దేశిస్తూ, వియోగంతో, పరాత్పరా అని బోధిస్తూ భక్తితో. ఆత్మజీవానా యని సంబోధిస్తూ విజ్ఞానంతో ఆత్మపరమాత్మ బాంధవ్య రీతులు కవి మనోరంజకంగా సరళమైన భాషలో చిత్రించారు. ఉదాహరణకు.

నేనిట నీవులేక క్షణమేనియునుం బ్రతుకంగలేను న
న్నినరకాన త్రోసిసుఖయింతువటన్నది వట్టిమాటనీ
మానస మెల్లనాపయి ఉమాకుసుమాళ! గ్రహింపు మేవియో
గానల దగ్ధచిత్తమును ఆత్మపతీ! అమృతామలాకృతీ
నేను శరీరమంచను కొనే తరుణాన త్వదీయదాసుడన్
నేను జీవుడంచనుకొనే సమయాన త్వదంశభూతుడన్
నేనన ఆత్మతేజమనో నిశ్చయ వెలప్పుడు గల్గు అప్పుడే
నేనన నీవు-నీవుమరి నేను-అభిన్నుల మాత్మరూపతన్

నవీనవిన్యాసంలో, ధారావాహికమైన శైలిలో నడిచిన ఆనందచేతన ఒక కావ్య స్వరూపలక్షణాలన్నీ పుణికిపుచ్చుకుంది. గ్రంథం ముందు మాటలో నుడివినట్లు కవి అంతర్గతంగా, ప్రాపంచిక ప్రభావంలో పడి, ఒక వ్యక్తిని ఉద్దేశించినచో, ఆనందచేతనలోని ఆధ్యాత్మికానందరసము కలుషితమయి బహుశా కావ్యం విలువ విమర్శకుల దృష్టిలో సన్నగిల్లవచ్చు. పరమాత్మ ఔన్నిత్య ఆరాధనలోని, గాఢమైన వ్యక్తి ఔన్నిత్య ప్రశంస యిమడ్చడం యితివృత్త ఉదాత్తతను భగ్న [illegible] ఎన్ను

కోవడం అవసరం. అయినా ఏ కొద్ది పద్యాలలోని అంతర్గత శ్లేషను ఆధారం చేసుకుని కావ్యలక్ష్యము వక్రించిన దని చెప్పుట సాహసము. బాహ్యంగా గోచరించే భావాన్ని గౌరవించి కవి కావ్యంలో చేత నానందం ఉందని చెప్పవచ్చు.

— పోతుకుచి సాంబశివరావు

# శ్రీరామానుజ చరిత్ర

గ్రంథకర్త : శ్రీరామానుజదాసుడు

ప్రకాశకులు : శ్రీ గోదాగ్రంథమాల,

పుటలు-41- వెల : 62 నయాపైసలు శ్రీమన్నారాయణ పురము, ఉల్లిపాలెము పోస్టు, దివితాలూకా, కృష్ణాజిల్లా

ఇది విశిష్టాద్వైత ధర్మ ప్రవర్తకులగు శ్రీరామానుజాచార్యులవారి జీవిత చరిత్ర. యావద్భారత దేశములో భక్తి స్రవంతిని ప్రవహింపజేసినవారు శ్రీ ఆచార్యులవారు. నాటినుండి నేటివఱకును ఆ ప్రవాహామునకు అడ్డుకట్టలు లేవు. వైష్ణవ భక్తి ఎందఱనో పునీతులను గావించుచున్నది. ఇట్టి గ్రంథములు ఈ కాలములో మిక్కిలి అవసరము. రచన మృదు మధురముగా, అత్యంత మనోజ్ఞముగా నున్నది.

— దశిక సూర్యప్రకాశరావు

# ద్రోణ ప్రశస్తి

రచన : శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

వెల రు. 2-50. (నెల్లూరు 2.)

శాస్త్రిగారు జగమెరిగిన పండితులు. భాసనాటకానువాదాలు, మేఘదూత సారంగధర చరిత్రకు వ్రాసిన 'జితకాశి' టీక వారి పాండిత్య ప్రకర్షకు నికషోపలాలు. ఇది కీ. శే. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'మహాభారత చరిత్రకు' సమాధానంగా వ్రాయబడింది. ద్రోణ, భీష్ములు దుర్యోధనునికి ద్రోహం చేశారనీ ఒక్క కర్ణుడే నిజమైన స్వామి భక్తుడనీ శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు చేసిన అభిశంసనలను నిరాకరిస్తూ, ప్రాసంగికంగా పాండవుల, వ్యాస ద్రోణుల ఔన్నత్యాదికములకు చర్చించారు. కర్ణుని సుగుణములు శూరత్వము ప్రత్యేకంగా

వైరాగ్యాని అర్జునుని పిరికితనం నిరూపించారు. ఈ గ్రంథం శాస్త్రిగారి ప్రతిభావ్యుత్పత్తులకు ఒక చక్కని తార్కాణం.

ఒక్క భారత కథలోనే కాదు, ఏ పౌరాణిక గ్రంథంలోనైనా విడ్డూరాలుండి, ఆయా మహాత్ముల లీలా విశేషాలతో ముడిపెట్టుకొనందే తృప్తిని కలిగించవు. అందువల్లనే ఈ గ్రంథాలలో ప్రధానమైన ధర్మప్రతిపాదనను స్వీకరించవలసిందే గాని మన యీ నాటి శాస్త్రీయ దృక్పథంతో పరిశీలన కుదురదు. పాండవులు కుండులనీ, కౌరవులు గోళకులనీ వ్యాస కర్ణులు కానీనులనే ప్రశ్నలు, నేడు కాదు, భారత కాలంనుంచీ ఉన్నాయి అవి పంచమ వేదానికి మెరుగులే కాని మచ్చలు కావు.

ద్రోణుని పాత్ర సమర్థించడంలో శాస్త్రిగారు ప్రశంసనీయమైన కృషి చేశారు. ఉదాత్త ధర్మవేత్తగా, వీరునిగా గురువుగా త్యాగిగా అతని కున్న ప్రత్యేకతను నిరూపించారు. తన శిష్యుల్లో అగ్రేసరుడవటంవలన, తనముందు ద్రుపదుని నిలబెట్టడం వలన అర్జునునిపై అభిమానం ఉంది. అంతమాత్రాన పక్షపాతమనరాదు. ఏకలవ్యుని విషయంలో శాస్త్రిగారు ద్రోణుడు నిమిత్తమాత్రుడనీ చేయించిన వాడు కృష్ణుడనీ యుక్తియుక్తంగా నిరూపించారు. శకటవ్యూహసందర్భంలో అర్జునుని విడిచిపుచ్చడం అసమర్థత అనడంకన్నా ఔదార్యం అనడం పాత్రగౌరవం కలిగిస్తుంది. పాండవులు ప్రవేశించకుండ అడ్డగించుటకే తాను అర్జునని విడిచిపుచ్చానని ద్రోణుడు దుర్యోధనునితో చెప్పిన సాకును శాస్త్రిగారు సమర్థించారు. ఆత్మవధోపాయం చెప్పడంలో అసత్యమాడిన ధర్మజునిదే దోషమంటూ ద్రోణుని త్యాగం ఉగ్గడించారు.

కర్ణుని కలరూపును చర్చిస్తూ శాస్త్రిగారు 'తమ్ముల రాజ్యలబ్ధికొరకు తనువును తృణీకరించిన త్యాగమూర్తి అనిపించుకొనవలెనని కర్ణునికోరిక' 'అందువలన దుర్యోధనునికి మిత్రునిగా నటించి తన అభీష్టము నెరవేర్చుకొన్నాడని చెప్పారు. దీనికి తార్కాణంగా తన జన్మరహస్యం ధర్మరాజుకు చెప్పవద్దనీ, కౌరవ పక్షపతనంలో తాను సద్గతి పొందగలడనీ కృష్ణునితో ఉద్యోగ పర్వమున చెప్పిన మాటలు ఉదహరించారు అవి కర్ణుని ఆభిజాత్యము సూచించు వాక్యములు తన జన్మరహస్యం కౌంతేయులకు తెలియరాదని చేసిన ప్రసంగం కాని తాను నమ్మింది కాదు పోనీ కృష్ణుడా మాటలను లెక్కించి సమాధానం చెప్పిందీ లేదు.

ముఖ్యంగా ప్రశంసించవలసింది శాస్త్రిగారి వచనశైలి. నిరాఘాటంగా సాగిపోతుంది. సామాన్యంగా శాస్త్రీయ విషయాలు చదివేటప్పుడు కనిపించే ఒడుదుడుకులు వారి రచనలో ఎక్కడా లేవు. కథవలెసాఫీగా నడుస్తుంది. వాడిన జాతీయాలు కొన్ని నెల్లూరి ప్రాంతానివే అయినా మనస్సున కుల్లాసాన్నిస్తాయి. ప్రతివారూ చదువదగ్గ గ్రంథం. వెల. రు. 2. 50.

—ఏ. రామయ్య

